శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః



శ్రీశోభకృత్ నామ సంవత్సర ధనుర్మాస సందర్భంగా

# సాంప్రదాయిక వ్యాస మాలిక- ౨౬

# (తిరుప్పావై వ్యాస మాలిక)

15-01-2024






'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళగ శింగరాచార్యులు


సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు



భగవద్రామానుజులు, శ్రీ పెరుంబుదూరు

# విషయ సూచిక

# తిరుప్పావై వ్యాస మాలిక

మాలా వ్యాససుమాత్మికా మితధియా దాసేన సందర్భితా
గోదాశ్రీవ్రతవైభవాంశవిషయా చైషా ఽ ర్పితా భక్తితః,
గోదామాధవపాదపంకజయుగే భూయాత్తయోః మోదదా
పిత్రోః తత్సుతవాగివా ఽపి కలుషా వాత్సల్యపూర్ణాశయోః.

గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలోని వైభవాన్ని తెలియజేసే విషయాలను ఆధారంగా చేసికొని, చాలా పరిమితమైన బుద్ధిని కలిగిన దాసుడు కూర్చిన ఈ వ్యాసాలనే పుష్పాల మాలికను దాసుడు శ్రీగోదాశ్రీరంగనాథుల శ్రీపాదపద్మాలలో భక్తితో సమర్పిస్తున్నాడు. ఇది దోషాలతో కూడినది అయినప్పటికీ, చిన్న వయస్సులో ఉండే పుత్రుడు పలికిన మాటలు అతని తల్లిదండ్రులకు ఆనందం కలిగించేటట్లుగా, ఆ దివ్యదంపతులకు ఆనందాన్ని కలిగించేదిగా కావాలి.

★★★★★

# తిరుప్పావై ప్రబంధంలో సద్విద్యా ప్రస్తావన

సద్విద్య ఛాందోగ్యోపనిషత్తులోని ఆఱవ అధ్యాయంలో ప్రస్తావింపబడింది. బ్రహ్మసూత్రాలలో ఈక్షత్యధికరణంలో (1-1-5) ఉన్నది. పలు బ్రహ్మవిద్యలను తెలిపే ఉపాఖ్యానంవలెనే ఈ విద్యను తెలిపే కథ కూడా చాలా ఆసక్తికరమైనది.

శ్వేతకేతువు ఉద్దాలకమహర్షి కుమారుడు. అతడు తన పన్నెండవ ఏటనే ఆచార్యసన్నిధిని చేరి, అక్కడ పన్నెండేళ్ళు విద్యాభ్యాసాన్ని చేసి, తండ్రి దగ్గరకు వచ్చాడు. తాను పరిపూర్ణమైన జ్ఞానాన్ని కల్గినవాణ్ణి అయ్యాను– అనే తృప్తితో వెలిగే ముఖంతో వచ్చిన కుమారుణ్ణి చూచి ఉద్దాలకుడు– "స్తబ్ధో ఽ సి ఉత తమాదేశ మప్రాక్ష్యః యేనాశ్రుతం శ్రుతం భవతి, అమతం మత, మవిజ్ఞాతం విజ్ఞాతమ్" (నాయనా! అన్నీ బాగా తెలిసినవానివలె కన్పిస్తున్నావు. ఏ పరమాత్మను వింటే, మననం చేస్తే, మనస్సులో దృఢంగా నిలుపుకొంటే అన్నీ విన్నట్లు, మననం చేసినట్లు, మనస్సులో దృఢంగా నిలుపుకొన్నట్లు అవుతుందో, అందఱినీ శాసించే ఆదేశశబ్దవాచ్యుడైన ఆ పరమాత్మను దర్శించావా!" అని అడిగాడు. అపుడు శ్వేతకేతువు "కథం ను భగవః! స ఆదేశో భవతి" (తండ్రీ! ఒక్క ఆదేశాన్ని తెలిస్తే అన్నీ తెలిసినట్లు ఏవిధంగా అవుతుందో చెప్పండి.) అని తన తండ్రిని తిరిగి ప్రశ్నించాడు. అపుడు ఉద్దాలకుడు పలు లౌకిక దృష్టాంతాలను ప్రదర్శిస్తూ "ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమ్" అనే తత్త్వాన్ని ఈ క్రింది విధంగా అతనికి వివరించాడు. "యథా సామ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్. వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" (నాయనా! ఒకే మట్టిపెళ్ళ కుమ్మరివానిద్వారా మట్టిముద్దగా, తర్వాత మూకుడుగా, కుండగా, ప్రమిదగా క్రమంగా మారుతున్నది. కొంతకాలానికి ఆ మూకుడు, కుండ, ప్రమిద – అన్నీ పగిలి

చిన్న ముక్కలై, చూర్ణమై మళ్ళీ మట్టిగానే మారుతున్నవి. అంటే, మధ్యలో కుండగా, ప్రమిదగా, మూకుడుగా రూపాలను పొందినవి, ఆ యా పేర్లతో వ్యవహరింపబడేవి అన్నీ మన్నుమాత్రమే – అన్నది సత్యం. "యథా స్యాత్, వాచారంభో వికారో నామధేయం లోహ మిత్యేవ సత్యమ్" (నాయనా! బంగారంతో వివిధాలైన ఆకృతులలో చేయబడిన, పలు పేర్లతో వ్యవహరింపబడే ఆభరణాలు అన్నీ బంగారమే అన్నది సత్యం.)

ఈ ఉదాహరణలలో– ప్రారంభంలో ఉండే మన్ను, బంగారం – మొదలైన మూల (కారణ) పదార్థాలు, ఆ తరువాత వివిధాకృతులను పొందిన వాటి కార్యరూపాలు అన్నీ ఒకటే. అవస్థాభేదం మాత్రమే వాటిమధ్య ఉన్నది. పదార్థంలో ఏ తేడా లేదు. ప్రారంభంలోనిది కారణావస్థ అయితే, తరువాత ఏర్పడినది కార్యావస్థ. కారణాలు అయిన మన్ను మొదలైనవానిని తెలిస్తే, వాటి కార్యాలు అయిన కుండ మొదలైనవానిని అన్నిటినీ తెలిసినట్లే. కార్యకారణాలు రెండూ భిన్నాలు కావు; ఒకటే అన్నది సత్యం.

ఈ లౌకికోదాహరణలనుబట్టి పరమాత్మతత్త్వాన్ని గ్రహించవచ్చు. "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" (నాయనా! సచ్ఛబ్దవాచ్యమే సృష్టికి ప్రారంభంలో ఉన్నది. అది ఒక్కటే. రెండవది లేదు – అని అంటూ శ్రుతి సచ్ఛబ్దవాచ్యమైన పరబ్రహ్మ మాత్రమే సృష్ట్యాదిలో ఉన్నదని అన్నది. ఆ సత్తు "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ, తత్తేజో ఽ సృజత" (పలు విధాలుగా రూపొందాలని సంకల్పించి ఆ సత్తు తేజస్సును సృష్టించింది) అని కూడా చెప్పింది. ఈ విధంగా సంకల్పించడం చేతనలక్షణం. అది అచేతన విషయంలో సాధ్యం కాదు. కనుక సచ్ఛబ్దవాచ్యం అచేతనం కాదు, చేతనమే. ఆ తరువాత శ్రుతిలో "ఆ

తేజస్సుకూడా పలు రీతులుగా రూపొందాలని సంకల్పించింది. అది జలాన్ని సృష్టించింది" – అని ఈ రీతిగా తేజస్సు, జలం మొదలైనవి సంకల్పించాయని చెప్పడంలో ఉద్దేశ్యం ఆ తేజస్సు, జలం మొదలైనవానిని శరీరంగా కల పరమాత్మ సంకల్పించాడని చెప్పడమే. అందువల్ల జగత్తులోనిది అంతా సచ్ఛబ్దవాచ్యుడైన పరమాత్మను ఆత్మగా కల్గి ఉన్నది– అనేది తత్త్వం. కారణరూపమైన పరబ్రహ్మ కార్యరూపమైన బ్రహ్మ కంటే భిన్నం కాదు. కారణావస్థలో నామరూపవిభాగాలను చేయడానికి వీలుకానంత సూక్ష్మంగా ఉన్న పరబ్రహ్మ కార్యదశలో స్థూలావస్థను పొంది నామరూపవిభాగాలను కల్గి స్పష్టంగా ప్రకాశిస్తుంది. అంతే తప్ప ముందు లేనిది ఏదీ నూతనంగా పుట్టడం లేదు. ముందున్నదానికి నాశమూ లేదు. కేవలం అవస్థాభేదం మాత్రమే. "Nothing is created nor destroyed" అని విజ్ఞానశాస్త్ర వచనం కూడా. "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్" అని వేదం చెప్పిన రీతిలో సృష్టికి పూర్వం సూక్ష్మావస్థలో ఉండే సచ్ఛబ్దవాచ్యుడైన పరమాత్మ కారణం. సృష్టికి తరువాత స్థూలావస్థను పొందిన పరమాత్మే కార్యం. అదే ప్రపంచం. అందువల్ల సూక్ష్మచిదచిద్విశిష్టమైన బ్రహ్మ కారణం కాగా, స్థూలచిదచిద్విశిష్టమైన బ్రహ్మకార్యం. ఈ రెండు అభిన్నాలు. ఇదే విశిష్టాద్వైతతత్త్వం. పరమవైదికమైన ఈ తత్వాన్ని తెలిసి, ఉపాసించేవాడు పరమాత్మను పొందుతాడు అని సద్విద్య బోధిస్తున్నది. విశిష్టాద్వైత సిద్ధాంతప్రతితంత్రార్థం అయిన చేతనాచేతనాలకు, పరమాత్మకు మధ్య గల శరీరశరీరి భావాన్ని బోధించే ఈ పరవిద్యలన్నిటిలో శిఖరాయమాణంగా భాసిస్తున్నది.

ఇపుడు, ఈ సద్విద్య ఆళ్వార్ల దివ్యప్రబంధసాహిత్యంలో అనుసంధింపబడ్డ తీరును కొంచెం గమనిద్దాం. సద్విద్య బ్రహ్మసూత్రాలలోని ఈక్షత్యధికరణంలో (1–

1-6) ప్రస్తావింపబడినదన్న అంశం పూర్వోక్తమే. ఈ అధికరణంలో - "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్" అనే ఛాందోగ్యోపనిషద్వాక్యంలో జగత్కారణంగా చెప్పబడ్డ, సచ్ఛబ్దంచేత నిర్దేశింపబడ్డ వస్తువు ప్రధానమే (అచిత్తు- ప్రకృతి) అయి ఉండాలి. ఎందుకంటే, "ఇదమ్" అనే శబ్దంచేత నిర్దేశింపబడే, సత్త్వరజస్తమోమయం అయిన జగత్తుకు ఆ త్రిగుణాలతో కూడుకొన్న ప్రధానమే కారణం అవుతుంది తప్ప, త్రిగుణరహితమైన పరబ్రహ్మ కారణం కాదు. అంతేకాక, ఆనుమానికమైన ప్రధానమే ఈ శ్రుతివాక్యంలో సచ్ఛబ్దవాచ్యం, అదే జగత్కారణం - అనే పూర్వపక్షం రాగా, "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" అని శ్రుతిలో చెప్పబడ్డ సంకల్పరూపమైన ఈక్షణక్రియ ప్రధానానికి కూడదు. అది సర్వజ్ఞుడుగా చెప్పబడే పరమాత్మకే సాధ్యం. కనుక చిదచిద్విశిష్టబ్రహ్మమే జగత్కారణం. తనకు శరీరభూతాలైన చిదచిత్తులద్వారా భగవానుడు సత్యరజస్తమోగుణాలతో అన్వయాన్ని పరోక్షంగా కల్గి ఉండడం సాధ్యమే. కనుక జగత్సాలక్షణ్యం పరమాత్మకు ఉన్నది. ఇందువల్ల సచ్ఛబ్దవాచ్యమైన కారణం ప్రధానం కాదు, పరమాత్మే- అని ఇత్యాదిగా ఆ పూర్వపక్షం నిరసింపబడింది. కాబట్టి ఈ అధికరణంలో పరమాత్మకు అచిత్తుకంటే ఉండే వ్యావృత్తి తెలుపబడింది. ఇదే సద్విద్యాసారాంశం. ఈ తత్త్వం తిరువాయ్!రిలోని "పొఱి యుణరు అవై యిలన్" (1-1-2) అనే ప్రయోగంద్వారా వ్యక్తం చేయబడింది. ఈ సూక్తికి పరమాత్మ ఇంద్రియప్రత్యక్షానికి విషయం అయిన అచిత్తువంటివాడు కాడు- అని భావం. అంటే, అచిత్తు కంటే విలక్షణుడైన పరమాత్మయొక్క స్వరూపాన్ని సాధించే ఈక్షత్యధికరణసారాన్ని ఈ సూక్తి ప్రతిపాదిస్తున్నది. ఈ అధికరణసారం సద్విద్యేకదా!

ఈ విద్యావైభవం ఇంకా పలు దివ్యసూరిసూక్తులలో ఉపబృంహితమైనది అనడానికి ఎన్నో ఉదాహరణలున్నాయి. తిరువాశిరియమ్ ప్రబంధంలోని "ఇదు పొరుట్కొల్లామ్ అరుమ్ పెఱల్ తని విత్తు ఒరుతానాకి" (4) అనే ప్రయోగం పరమాత్మనిమిత్తోపాదాన సహకారిరూప త్రివిధకారణ భూతుడని తెలుపడంద్వారా ఈ విద్యను సూచిస్తున్నదని చెప్పవచ్చు. "తానోరురువే తనివిత్తాయ్" (1–5–5) అనే తిరువాయ్ మొழி సూక్తికూడా సద్విద్యాప్రతిపాదకం అనే విషయం ఈడు వ్యాఖ్యలో సుస్పష్టం. సద్విద్యాశ్రుతిలో "ఏక మేవ", "అద్వితీయ మేవ" అని అంటూ ఉపాదాన, నిమిత్త కారణాలు చెప్పబడ్డాయని, మూడవ కారణం అయిన సహకారికారణం ఈ రెండింటివల్ల ఉపలక్షితమని శ్రీభాష్యంలో చెప్పబడింది. "సదేవ", "ఏకమేవ", "అద్వితీయమ్"– అనే పదాలు క్రమంగా సహకారి–ఉపాదాననిమిత్తకారణాలు చెబుతున్నాయనే నిర్వాహాంతరాన్ని పెరియవాచ్చాన్పిళ్ళై తమ ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో చూపారు. తిరుమழிశై ప్పిరాన్ తిరుచ్ఛన్దవిరుత్తంలో "ఆది యాది యాది నీ" (3) అనే సూక్తిలో ఆదిశబ్దాన్ని మూడుమార్లు ప్రయోగిస్తూ కారణత్రయాత్మకుడు భగవానుడని పల్కారు. నమ్మాళ్వార్లుకూడా "విత్తాయ్", "ఓర్ విత్తాయ్", "ఓర్ తని విత్తాయ్"– అని అంటూ ఉపాదాన– నిమిత్త –సహకారికారణత్రయాన్ని తెలిపారని పూర్వాచార్యులు అభిప్రాయపడ్డారు.

"మహార్హః" (525) అనే నామం ఈవిద్యావైభవాన్ని అనుసంధిస్తున్నవి. విష్ణుసహస్రనామాలలోని "సదక్షరమ్" అనే నామంలో ఈ విద్యానుసంధానం ఉన్నదని శ్రీ పరాశరభట్టర్ భాష్యాన్నిబట్టి చెప్పవచ్చు.

ఇక, ఈ సద్విద్యలో చెప్పబడే సచ్ఛబ్దవాచ్యుడైనపరమాత్మ లక్ష్మీవిశిష్టుడనే

విశేషంకూడా ఉభయవేదాంతసూక్తిసిద్ధం. సృష్టికి ప్రారంభంలో సచ్ఛబ్దవాచ్యుడొక్కడే ఉన్నాడని పల్కిన వేదమే "సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి" (కాలం మొదలైన వస్తువులన్నీ విద్యుద్వర్ణాన్ని కల పురుషుని నుండి పుట్టాయి.) అని పల్కింది. సహజంగా నల్లని పురుషునకు ఈ విద్యుద్వర్ణం ఏ విధంగా వచ్చింది? అని అంటే, హిరణ్యవర్ణ అయిన లక్ష్మియొక్క నిత్యసాన్నిధ్యంచేతనే. "తిరు క్కణ్డేన్ పొన్మేని కణ్డేన్" అని మహాయోగి అనబడే పేయాళ్వార్లు ఈ అర్థాన్ని పరోక్షంగా తెలిపారు. సృష్టిసమయంలో పరమాత్మ లక్ష్మీవిశిష్టుడనే విషయాన్ని నమ్మాళ్వార్లుకూడా తిరువాయ్ మొழி ప్రబంధంలో "ఞాలమ్ పడైత్తవనై, తిరుమార్బనై" (3-7-8) (లోకాన్ని సృష్టించినవానిని, లక్ష్మీవల్లభుని) అనే పదాలను వెంటవెంటనే ప్రయోగించడంద్వారా స్ఫురింపజేశారు. ఇక శ్రుతిలోని "ఏక మేవ, అద్వితీయమ్" అనే సూక్తి ఏ విధంగా కుదురుతుంది? అని అంటే, "స ఏకాకీ న రమేత" అనే శ్రుతిలో "ఏకాకీవ న రమేత" అని అన్వయించినట్లే ఇక్కడ కూడా అర్థం చెప్పాలి. సృష్ట్యాదిలో కూడా చిదచిత్తులు నామరూపవిభాగానర్హదశలో ఉన్నాయని చెప్పబడిందే తప్ప, పూర్తిగా లేవని అర్థం కాదుకదా! అయితే, కారణావస్థలోని ఈ లక్ష్మీసంబంధం లీలారసమాత్రజనకం కాగా, శేషిత్వావస్థలలోని లక్ష్మీసంబంధం భోగరసమాత్రజనకం- అని పూర్వాచార్యుల నిర్వాహం.

ఇక ఈ విద్యాప్రసక్తి తిరుప్పావై ప్రబంధంలో ఎక్కడ చేయబడింది? అని గమనిస్తే, ఈ విద్యాప్రస్తావన " మారి మలై ముழஞ்జిల్" అనే 23వ పాశురంలో చేయబడిందని పూర్వాచార్యులు అభిప్రాయ పడినట్లుగా మనకు కనిపిస్తుంది. పాశురం ఈ విధంగా ఉన్నది-

మారి మలై ముఴ్ఞ్జిల్, మన్ని క్కిడందుఉంగుమ్ ★
శీరియ శింగమ్, అఱివుత్తు త్తీ విఴిత్తు ★
వేరి మయిర్ పొంగ, ఎప్పాడుమ్ పేర్ న్దుదఱి ★
మూరి నిమిర్ న్దు, ముఴఙ్గి ప్పుఱప్పట్టు ★★
పోదరుమా పోలే, నీ పూవై ప్పూ వణ్ణా! ★ ఉన్
కోయిల్ నిన్ఱింగనే పోందరుళి ★ కోప్పుడైయ
శీరియ శింగాసనత్తిరుందు ★ యామ్ వంద
కారియమ్ ఆరాయ్ న్దు అరుళేలోర్ ఎమ్ పావాయ్

ఈ పాశురంలోని భావం ఏమంటే,

వర్షాకాలంలో పర్వతగుహలో కదలకుండా పరుండి నిద్రిస్తున్న శౌర్యలక్ష్మి కలిగిన సింహం, ఆ వర్షాకాలం ముగిసిన తరువాత, మేల్కొని కళ్ళను తెరిచి క్రూరంగా చూచి సహజమైన సువాసనను కలిగిన తన సటలను అన్ని వైపులా నిక్కబొడుచుకుని ఉండేటట్లుగా కదలి, తన శరీరాన్ని అంతటినీ విదలించుకుని, బాగా ముందుకు సాగి, గర్జించి, ఆ గుహ నుండి బయటకు వచ్చేటట్లుగా, కానుగపువ్వు వంటి వర్ణాన్ని కలిగిన ఓ శ్రీకృష్ణా! నీవు నీ శయ్యాగృహంనుండి ఈ విధంగా బయటకు వచ్చి, మనోహరమైన సన్నివేశాన్ని కలిగిన గొప్ప సింహాసనంలో కూర్చుని, మేము వచ్చిన కార్యాన్ని గూర్చి విచారించి, మమ్ములను అనుగ్రహించాలి. ఈ పాశురంలో ప్రయోగింపబడ్డ ఆ యా పదాలలోని అర్థస్వారస్యంచేత సద్విద్యాస్వరూపం సూచింపబడిందని పెద్దల అభిప్రాయం.

జీవులు సంసారసముద్రంలో పడి కొట్టుకొని పోతూ ఉంటే, భగవంతుడు వారిని తన దయతో కాపాడుతాడు. తన దయాగుణకార్యంగానే భగవంతుడు సృష్టిస్థితిప్రళయాలను చేస్తాడు. ప్రళయసమయంలో భగవానుడు జీవులను అందరినీ తనలో ఇముడ్చుచుకొని, అంతాతానే అనేటట్లుగా ఉండేవాడై, తనకంటే

వేరైన వస్తువు ఏది లేదనే విధంగా, ప్రళయ సముద్రంలో శయనించి ఉంటాడు. అందుచేత ఈ పాశురంలో చెప్పబడిన వర్షాకాలం ప్రళయకాలానికి సూచకం. అప్పుడు ఎటువంటి హెచ్చుతగ్గులు లేకుండా జీవులందరూ పరమాత్మలో అంతర్భవించి ఉంటారు. అప్పుడు పరమాత్మ వేదగుహలో శయనించి ఉంటాడు. అదే ఇక్కడ సింహం గుహలో పరుండి ఉండడంగా చెప్పబడింది.

సృష్టికి ముందు "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" (సౌమ్యుడా సృష్టికి ముందు సత్ అనే శబ్దంచేత చెప్పదగిన, తనకంటే వేరుగా చూపదగిన వస్తువేది లేనందు వల్ల, పరమాత్మ ఒక్కడు మాత్రమే ఉన్నాడు) అని వేదం చెప్పినట్లుగా పరమాత్మ ఒక్కడే ఉంటాడు. కొండ గుహలో సింహం నిద్రిస్తూ ఉండేటట్లుగా, పరమాత్మ స్థూలనామరూప విభాగాలను గల జగద్రూపంలో వ్యక్తం కావడానికి ముందు వేదగుహలో శయనించి ఉంటాడు. ఇక్కడ సింహం గుహలో నిద్రించడం అంటే, భగవంతుడు గ్రహించడానికి సాధ్యం కాని స్థానంలో ఉండడమే. ఇక్కడ పరమాత్మను సింహంగా రూపించడంకూడా సద్విద్యానుగుణమే. సింహం అన్ని జంతువులను హింసించే స్వభావాన్ని కలిగినది. సింహ శబ్దవ్యుత్పత్తి కూడా "హన – హింసా గత్యోః" అనే ధాతువు నుండి ఏర్పడింది. అందువల్ల సింహ శబ్దానికి "సకల ప్రాణులను హింసించేది" అని, "అందంగా నడిచేది" అని అర్థం. ప్రళయ సమయాల్లో భగవంతుడు " యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః, మృత్యుః యస్యోపసేచనమ్" (ఏ పరమాత్మకు బ్రాహ్మణులు, క్షత్రియులు అనే రెండు వర్గాలవారు ఆహారంగా అవుతున్నారో, ఏ పరమాత్మకు యముడు కూడా ఊరగాయవలె ఉపదంశం అవుతున్నాడో) అని వేదం తెలిపినట్లుగా సమస్త జగత్తును తనకు ఆహారంగా గ్రహించి, తన కడుపులో పెట్టుకొని కాపాడతాడు అని శాస్త్రాలు

తెలుపుతున్నాయి. అందువల్ల ప్రళయసమయంలో భగవంతుని సింహంగా చెప్పడంకూడా చాలా యుక్తమైనది.

ప్రళయ సమయానికి ముందుకూడా భగవంతుడు సమస్త కళ్యాణ గుణపూర్ణుడుగానే ఉంటాడు, అంతే తప్ప, నిర్గుణుడుగా ఉండడు. ఈ విషయం పాశురంలోని "శీరియ శింగమ్" (ప్రతాపాన్ని కలిగిన సింహం) అనే ప్రయోగం సూచిస్తున్నది. సింహానికి సహజమైన గుణం ప్రతాపం. ఆ గుణాన్ని అది నిద్రించే సమయంలో కూడా కలిగి ఉంటుంది ఆ విధంగానే భగవంతుడుకూడా తనకు సహజంగా ఉండే సమస్త కళ్యాణ గుణాలను కూడా కలిగి ఉంటాడు.

ఇక్కడ, "శీరియ శింగమ్" అనే ప్రయోగం ద్వారా ఇంకొక సద్విద్యకు చెందిన, వేదప్రతిపాదితతత్వం కూడా వ్యక్తమవుతున్నది. సృష్టి కాలానికి ముందు కూడా భగవంతుడు లక్ష్మీ విశిష్టుడుగానే ఉంటాడు అని ఈ ప్రయోగం సూచిస్తున్నది. "శీరియ శింగమ్" అనే ప్రయోగానికి "లక్ష్మీసహితుడైన సింహంవంటి పరమాత్మ" అనే అర్థాన్ని గ్రహించవచ్చు. ఏ విధంగా అయితే ప్రతాపం అనే గుణం సింహంనుండి వేరు చేయడానికి సాధ్యం కాని విధంగా ఉంటుందో, ఆ గుణంతో కూడినదిగానే కొండ గుహలో నిద్రించే సింహం ఉంటుందో, అదే విధంగా ప్రళయసమయంలో భగవంతుడు లక్ష్మీదేవితో విడదీయరాని సంబంధాన్ని కలిగినవాడై, ఆమెతో కూడినవాడై ఉంటాడు –అని ఈ ప్రయోగం వల్ల తెలుస్తున్నది. వేదం కూడా ఈ విషయాన్ని "సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి" (కాలం మొదలైన వస్తువులన్నీ విద్యుద్వర్ణాన్ని కల పురుషుని నుండి పుట్టాయి.) అని పల్కింది.

## తిరుప్పావై ప్రబంధంలో సద్విద్యా ప్రస్తావన

వర్షాకాలం తీరిన తరువాత, సింహం తెలివి తెచ్చుకొని, తీక్ష్ణంగా చూసి, తన పరిమళాన్ని కలిగిన సటలను నిక్కబొడుచుకునేటట్లు చేసుకొని, పైకి లేచి, అటు ఇటు సాగి, గర్జిస్తూ ముందుకు నడుస్తుంది. ఆ విధంగానే, భగవంతుడు కూడా ప్రలయకాలం తీరిన తరువాత, సృష్టికి అనుగుణమైన సమయం ఆసన్నం కాగానే, సృష్టికి ఉపక్రమిస్తాడు. సింహం తన కళ్ళు తెరచి చూసినట్లుగా, భగవంతుడు కూడా " తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అని " నేను అనేక విధాలుగా కాగలను "అని సంకల్పించుకుంటాడు. ఈ భగవంతుని సంకల్పమే సింహం చూడడంగా చెప్పబడింది.

ఆ సమయంలో సింహం తన సహజమైన సుగంధాన్ని కలిగిన సటలను విస్తరించుకుంటుంది. భగవానుడు కూడా సర్వగంధాలను కలిగినతత్వం. అటువంటి భగవానుడు అనేక విధాలుగా చేతనా చేతనాల రూపంలో వ్యక్తం అయినప్పుడుకదా, ఈ జగత్తులో సర్వవిధపరిమళాలు ప్రకాశిస్తాయి. కారణగుణాలు కార్యంలో సంక్రమిస్తాయి కదా.

సింహం కళ్ళు తెరచి చూడగానే, దాని చూపు అగ్నివలె ప్రకాశిస్తుంది. సృష్టిక్రమంలోకూడా, ముందు తేజస్సు పుడుతుంది. దానినుండి జలం, పృథివి మొదలైనవి ఆవిర్భవిస్తాయి. ఆ క్రమం ఇక్కడ సూచింపబడింది.

జగత్ కారణతత్వం ఒక్కటే. అది ప్రళయ కాలంలో రెండవది ఏదీ లేని విధంగా సూక్ష్మమై, నామరూప విభాగాలలో లేనిదై ఉంటుంది. తనకు శరీరభూతమైన ప్రకృతిని, జీవులను తనలో చేర్చుకొని ఉంటుంది. ఈ జగత్ కారణతత్వం సృష్టి కాలంలో తనకు తానే అనేక విధాలుగా పరిణమించాలని సంకల్పాన్ని చేస్తుంది. దాని కారణంగా ఆ తత్వంనుండి తేజస్సు, జలం, పృథివి

మొదలైన అన్ని తత్వాలు ఆవిర్భవిస్తాయి ఈ తత్వాలన్ని కలసి మహాభూతాలై, బ్రహ్మాండం ఏర్పడుతుంది. ఈ విధంగా ఏర్పడిన బ్రహ్మాండంనుండి బ్రహ్మ ఆవిర్భవిస్తాడు. దీనికి తరువాత పరమాత్మ ఈ బ్రహ్మకు అంతర్యామిగా ఉండి, ఆ బ్రహ్మ ద్వారా సృష్టినంతటిని నిర్వహిస్తాడు. ఈ క్రమమే ప్రస్తుత పాశురంలో సింహం నిద్ర లేచి, చూచి, అన్ని వైపులా దొర్లి, శరీరాన్ని సాగదీసికొని ముందుకు సాగి పోవడం అనే ప్రక్రియద్వారా సూచింపబడింది. దీనినిబట్టి జగత్తు అంతా పరమాత్మకు శరీరమని, సృష్టికి ముందు ఉండే కారణతత్వం, గుహలో ఉండే సింహంవలె, తన శరీరాన్ని ముడుచుకుని ఉన్నప్పుడు, జగత్తు ఉన్నట్లు కనిపించదని, అయినప్పటికీ జగత్తు సత్యం అని, అప్పుడుకూడా సూక్ష్మరూపంలో ఉన్నదని తెలుస్తున్నది. సాగి ముందుకు సాగే సింహం శరీరంలో ఉండే భాగం ఏ భాగం అయినా ఇదివరకు లేనిది కాదు. దానిలో ఉన్నదే వెలికి వచ్చింది, అంతే. అది వర్షాకాలంలో ముడుచుకుని ఉండేటప్పుడు, వ్యక్తంగా దాని అవయవాలు ఏమీ కనిపించవు. అయినప్పటికీ అవి ఉన్నాయి కదా. ఆ విధంగానే, ప్రళయ కాలంలో పరమాత్మకు శరీరభూతాలైన చేతనాచేతనాలు నామరూపాలు ఏమీ లేకుండా పరమాత్మలో అంతర్భవించి ఉంటాయి. సూక్ష్మ రూపంలో ఉంటాయి. సృష్టికాలంలో భగవంతుని సంకల్పం కారణంగా స్థూలరూపంలో అభివ్యక్తం అవుతాయి.

ఈ విధంగా ఈ పాశురంలో సద్విద్యాప్రకరణానికి సంబంధించిన పలు విలక్షణమైన అంశాలు సూచింపబడడం వల్ల ఇందులో ఆ విద్య ప్రతిపాదింపబడిందని చెప్పవచ్చు – అని పెద్దల అభిప్రాయం.

★★★★★

# భగవానుని సింహసామ్యమ్

తిరుప్పావై ప్రబంధంలోని 23వ పాశురంలో గోదాదేవి శ్రీకృష్ణభగవానుని ఒక అందమైన సింహంగా రూపణ చేస్తూ, సింహగతితో శయనగృహంనుండి ఆస్థాన మండపానికి వేంచేసి, తన అందమైన గమనాలతో తమకు ఆనందం కలిగించమని ప్రార్థించినది. ఈ విధంగా భగవంతుని సింహంగా భావించి పలకడంలోని కొన్ని విశేషార్థాలను భావన చేద్దాం.

"యశోదై ఇళమ్ శింగమ్" (యశోదా దేవి బాలసింహం) అని, "శిఱ్ఱాయర్ శింగమ్" (చిన్న ప్రాయంలో ఉండే గోపాలురలో సింహం), అని ఈ విధంగా పలు సందర్భాలలో దివ్యసూరులు భగవానుని సింహంగా రూపించి పలకడం జరిగింది.

1) సింహం మృగాలు అన్నిటిలోనూ రాజు అని పేరు పడినది. భగవంతుడు కూడా "పారళంద పేరరశే! ఎమ్ విశుమ్బరశే!" (భూమిని కొలిచిన మహాప్రభూ! నా పరమపదనాథా!) అని రాజాధిరాజుగా పేరు పడినవాడుకదా.

2) సింహం గొప్ప గొప్ప అరణ్యాలలో సంచరిస్తుంది. భగవంతుడుకూడా మహారణ్యం అనే పేరు పడిన బృహదారణ్యకం మొదలైన ఉపనిషత్తులలో సంచారాన్ని కలిగి ఉంటాడు.

3) సింహం "మలై ముழైఞ్జిల్ మన్ని క్కిడందు ఉఱంగుమ్" (పర్వత గుహలలో స్థిరంగా పరుండి నిద్రిస్తుంది). భగవంతుడు కూడా " తెన్న నుయర్ పొరుప్పుమ్ దెయ్ వ వడమలైయుమ్" అని చెప్పినట్లుగా తిరుమల, వనగిరి, హస్తిగిరి మొదలైన పర్వతాల శిఖరాలలో నివాసాన్ని కలిగి ఉంటాడు. విశేషించి, " నీళాతుంగస్తనగిరి తటీసుప్తదై" ఉంటాడు.

4) సింహం ఎవరికీ సాధీనం చేసుకోవడానికి సాధ్యం కానిదిగా ఉన్నప్పటికీ, తనతో అలవాటు పడి ఉండే కొద్ది మందికిమాత్రం పూర్తిగా విధేయంగా ఉండడాన్ని మనం

లోకంలో గమనిస్తున్నాము. భగవంతుడు కూడా, " పిఱర్ కట్కు అరియ విత్తకన్" (తన విషయంలో భక్తి లేనివారికి తెలుసుకోవడానికి సాధ్యం కాని ఆశ్చర్యభూతుడు) అయినప్పటికీ, "పత్తుడై అడియవర్ కట్కు ఎళియవన్" (భక్తిని కలిగినవారికి సులభుడుగా ఉంటాడు అనేది ప్రసిద్ధంకదా. భూమికి భారంగా ఉండే దుర్యోధనుడు తనను అవమానించడానికి సాధ్యం కాకుండా ఉన్నవాడైనప్పటికీ, శ్రీకృష్ణుడు, " సేనయో రుభయోః మధ్యే రథం స్థాపయ మే ఽ చ్యుత!" (అచ్యుతా! రెండు సేనల మధ్యలో నా రథాన్ని నిలుపు) అని ఈ విధంగా పలు విధాలుగా అర్జునుడు చెప్పిన విధంగా అతనికి విధేయుడై ఉన్న విషయాన్ని ఇక్కడ స్మరించాలి.

5) సింహం చాలా గంభీరమైన అందమైన నడకలను కలిగి ఉంటుంది. " కానగమ్ పడి ఉలావి ఉలావి కరుమ్ శిఱుక్కణ్" అని, " సింహవిక్రాంతగామినమ్" అని చెప్పిన విధంగా నడైచక్రవర్తి అనేటట్లుగా గమన సౌందర్యంలో ప్రసిద్ధిని కలిగి ఉంటుంది. " రామే ప్రమాదం మాకార్షీః పుత్ర! భ్రాతరి గచ్ఛతి" (కుమారా! రాముడు నడచి వెళుతూ ఉండగా, అతని గమనాన్ని చూసి, అందులో ఆసక్తుడవై అతనికి సేవచేయడంలో పొరపాటు పడకు) అని లక్ష్మణుని చూసి సుమిత్ర చెప్పిన మాటలో "గచ్ఛతి" అనే పదానికి మన పూర్వాచార్యులు సందర్భానికి పొసగేటట్టుగా అనుగ్రహించిన అర్థవిశేషం ఇక్కడ అనుసంధించదగినది.

6) సింహం మదగజాలను అవలీలగా సంహరిస్తుంది. భగవంతుడుకూడా మధు కైటభ హిరణ్య కశిపు హిరణ్యాక్ష రావణ కుంభకర్ణ కంస శిశుపాలాదులనే మదగజాలను అవలీలగా గిల్లి ఆవల పారవేశాడు.

ఈ విధంగా, ఇంకా అనేక విధాలైన సామ్యాలను భగవంతునకు, సింహానికి మధ్య సంభావించవచ్చు.

★★★★★

# తిరుప్పావైప్రబంధంలో దహర విద్యాప్రస్తావన

లోకంలో చక్రవర్తికి రాజధానీ నగరం ఉంటుంది. ఉభయ విభూతులకు నాయకుడైన పరమాత్మ కంటే గొప్ప సార్వభౌముడు ఎవరూ ఉండరు కదా! సర్వత్రా గుణాలతోనూ, స్వరూపంతోను అన్ని విధాలుగాను అందరితో సంబంధం కలిగిన పరమాత్మయే నిజమైన చక్రవర్తి, రాజాధిరాజు. ఇటువంటి పరమాత్మ అనే చక్రవర్తికి ఒక రాజధానీనగరం ఉన్నది దానిని వేదాంతాలు అందంగా రూపణ చేసి పదికాయి. అది ఏదో కాదు, జీవుని శరీరమే.

శరీరాన్ని ఒక పురంగా, ఇంద్రియాలను పౌరులుగా, బ్రహ్మను సార్వభౌముడుగా, తనను భృత్యుడిగా భావించి, ఆ భగవానుని సేవించాలని వేదాంతజ్ఞుల నిర్ణయం. శరీరం 9 ద్వారా కలిగిన పురంగాను, 11 ద్వారాలు కలిగిన పురంగాను వర్ణించబడింది.

జీవుడు ఉపాసించటానికి వీలుగా సన్నిహితంగా తన శరీరంలోనే ఉండే పరమాత్మను కల్యాణ గుణాలతో ఉపాశించే విధానాన్ని చెబుతున్నది, ఈ దహర విద్య. వివిధ లోకసంచారాదులు, సత్యసంకల్పాది సిద్ధులు ఇందులో మనకు గోచరిస్తాయి.

ఛాందోగ్యోపనిషత్తు ఈ తహర విద్యను తెలియజేసింది.

"అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరో ఽ స్మిన్ అంతర ఆకాశః, తస్మిన్ యదంతరః తదన్వేష్టవ్యమ్, తద్వావ విజిజ్ఞాసితవ్యమితి" అనే ఉపనిషద్వాక్యం ఈ విద్యను ప్రతిపాదిస్తున్నది.

ఈ శరీరం బ్రహ్మపురం, బ్రహ్మ నివసించే స్థానం. ఇందులో తామర పువ్వువంటి సూక్ష్మమైన హృదయం ఉంటుంది. ఇక్కడ, ఆకాశం అంటే, భౌతికమైన ఆకాశం కాదు. ఆకాశ శబ్దంచేత ఇక్కడ చెప్పబడేది పరమాత్మయే. "ఆ

సమంతాత్ కాశత ఇతి ఆకాశః "అనే వ్యుత్పత్తిని బట్టి పరమాత్మకే ఆకాశ శబ్దవ్యవహారం సిద్ధిస్తుంది.

ఈ విధంగా దహరపుండరీకంలో ఉండే దహరాకాశాన్ని, అందులో ఉండే పరమాత్మను, ఆ పరమాత్మ ఉండే చోటును శ్రవణం, మననం, ధ్యానం మొదలైనవాటి వల్ల తెలిసికొని, ఉపాసకుడు ఉపాసించాలి.

ఈ దహరాకాశానికి కల అతిశయాన్ని ఉపనిషత్తు ఈ విధంగా గొప్పగా వర్ణిస్తున్నది.

"యావాన్వా అయ మాకాశః, తావానేషోంతర హృదయ ఆకాశః.
ఉభే అస్మిన్ ద్యావాపృథివీ అంతరేణ సమాహితే,
ఉభా వగ్ని శ్చ వాయు శ్చ సూర్యా చంద్రమసా వుభౌ,
విద్యున్నక్షత్రాణి యచ్చాస్యేహాస్తి యచ్చ నాస్తి
సర్వం తస్మిన్ సమాహితమితి"

ఈ ప్రపంచంలో బయట ఉండే భౌతికమైన ఆకాశం వలెనే, హృదయ పుండరీకం మధ్యలో ఉండే ఆకాశం కూడా చాలా విశాలమైనది. అందులో ద్యావాపృథువులు, అగ్ని, వాయువు, సూర్యచంద్రులు, విద్యుత్తు, నక్షత్రాలు అన్నీ ఉన్నాయి. ఈ ద్యావాపృథువులు మొదలైనవాటి వల్ల భోగ్యభోగస్థాన భోగోపకరణాలు అన్నీ సూచింపబడతాయి. అగ్నిసూర్యాదిశబ్దాలవల్ల భోక్తృవర్గం అంతా చెప్పబడుతుంది.

ఉపాసకునకు ఈ లోకంలో ఉండేవన్నీ దహరాకాశంలోకూడా ఉన్నాయి అంతేకాదు, ఈ లోకంలో లేనివి కూడా అక్కడ దహరాకాశంలో ఉన్నాయి. ఇక్కడ కేవలం మనస్సులోని ఆలోచనలకు మాత్రమే అందేవి, అనుభవానికి అందనివి కనిపించనివి కూడా అక్కడ ఉంటాయి. దీనిని బట్టి ఈ దహరాకాశం అన్నిటికీ ఆధారమైనదని తెలుస్తున్నది.

తిరుప్పావైప్రబంధంలో దహర విద్యాప్రస్తావన

ఈ దహరాకాశం ఉపాసకుని శరీరంలో ఉంటుంది కదా! మరి, ఉపాసక శరీరగతమైన దోషాలు ఏమైనా ఈ బ్రహ్మకు రాజధాని అయిన ఈ దహరాకాశానికి సంక్రమిస్తాయా? అని అంటే, ఏ దోషమూ దీనికి సంక్రమించదు. దీనిని ఉపనిషత్తు ఈ విధంగా చెబుతున్నది.

"నాస్య జరయైతజ్జీర్యతి, న వధేనాస్య హన్యతే,
ఏతత్ సత్యం బ్రహ్మపురం అస్మిన్ కామాః సమాహితాః,
ఏష ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యుః విశోకో
విజిఘత్సో ఽ పిపాసః సత్యకామః సత్యసంకల్పః,
యథా హ్యేవేష ప్రజాః అన్వావిశంతి యథానుశాసనం
యం యమంత మభికామా భవంతి, యం జనపదం
యం క్షేత్రభాగం తం తమేవోపజీవంతి"

ఈ భౌతికమైన దేహానికి వార్ధకం వచ్చినప్పటికీ, ఈ బ్రహ్మపురం ఏమీ జీర్ణం కాదు. ఈ శరీరం నశించినార అది నశించదు. బ్రహ్మపురం నిర్వికారమైనది. అందులో కల్యాణ గుణాలు ఉన్నాయి. ఏ విధమైన పాపస్పర్శ దానికి లేదు. అది, వార్ధక్యం, మృత్యువు, శోకం, ఆకలి, దాహం మొదలైన హేయగుణాలు ఏమీ లేనిది. అంతే కాదు, సత్యకామాలు, సత్యసంకల్పాలు, అంటే, అన్ని విధాలయిన కళ్యాణ గుణాలు కలిగినది, అది.

ఈ లోకంలో, ప్రభువు శాసనాన్ని అనుసరించి, ఆ ఆజ్ఞకు పరతంత్రులుగా ప్రజలు భోగానుభవాలను పొందుతారు. దహరాకాశమనబడే బ్రహ్మపురంలో కూడా, ఆ విధంగానే, పరమాత్మకు పరతంత్రులుగానే ఆ యా భోగాలను ఉపాసకులు అనుభవిస్తారు.

ఈ లోకంలో కర్మల వల్ల సాధించిన భోగాలు నశించినట్లే, పుణ్యం వల్ల అర్జించిన భోగాలు కూడా నశిస్తాయి.

"తద్యదేహ కర్మచితో లోకః క్షీయతే
ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే,
తద్య ఇహాత్మాన మననువిద్య వ్రజంత్యేంతాంశ్చ
సత్యాన్ కామాన్ తేషాం సర్వేషు లోకేష్వకామచారో భవతి,
ఆథ ఇహాత్మనమనువిద్య వ్రజంత్యేంతాంశ్చ
సత్యాన్ కామాన్ తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి,"

ఉపాసకులు ఈ లోకంలో పరమాత్మకు ఉండే సత్యకామత్వాది కళ్యాణ గుణాలను తెలుసుకోకుండా పరలోకాలకు చేరితే, అటువంటివారికి ఆ లోకాలలో స్వేచ్ఛమైన సంచారం ఉండదు. ఆ విధంగా కాకుండా, ఈ లోకంలో పరమాత్మను, ఆ స్వామికి కల సత్యకామత్వాది గుణాలను చక్కగా తెలిసికొని, పరలోకాలకు చేరినవారు అన్ని లోకాలలోనూ స్వేచ్ఛగా సంచారం చేయగలిగినవారు అవుతారు. అందుచేత, ఆయన దివ్యమంగళవిగ్రహుడని తెలిసికొని, అతని కళ్యాణగుణాల తీరు తెన్నులను తెలిసికొని, ఆయన ఉండే స్థానాన్ని తెలిసికొ , ఆ పరమాత్మ కళ్యాణ గుణాకరుడు, సకలాధారుడు అని తెలిసికొని, అతనిని ఉపాసించాలి.

ఈ విధంగా ఉపాసించినవాడు తాను కూడా సత్యకాముడు, సత్యసంకల్పుడు కాగలడు.

"యం కామం కామయతే సో ఽ స్య సంకల్పాదేవ సముత్తిష్ఠతి,
తేన సంపన్నో మహీయతే"

ఉపాసకుడు కోరినవన్నీ అతని సంకల్పంవల్లనే కలుగుతాయి., పితృలోకం కానీ, మాతృలోకం కానీ అంతా అతని సంకల్ప మాత్రం చేతనే సముత్పన్నం అవుతుంది. దహర పుండరీకంలో ఉండే దహరాకాశవర్తి అయిన పరమాత్మ ఉపాసనవల్ల ఇవన్నీ సిద్ధిస్తాయి – దహరవిద్య తెలుపుతున్నది.

ఇక, తిరుప్పావై ప్రబంధంలో ఈ విద్య ఎక్కడ ప్రస్తావింపబడింది? అని గమనించి చూసినప్పుడు, రెండు పాశురాలలో ఈ విద్యాప్రస్తావన కనిపిస్తున్నదని పెద్దలు సంభావన చేశారు.

## తిరుప్పావైప్రబంధంలో దహర విద్యాప్రస్తావన

ఎనిమిదవ పాశురంలో "కీ‌ళ్ వానమ్ వెళ్లెన్ఱు" అని ప్రయోగింపబడింది. వానం అంటే, ఆకాశం. " దహర ఉత్తరేభ్యః" అనే బ్రహ్మసూత్రాన్ని అనుసరిస్తూ పలికిన కూరేశులు సుందరబాహుస్తవంలో "యం తం విదు రష్టగుణోపజుష్ట మాకాశ మౌపనిషదీషు సరస్వతీషు" (భగవంతుని గుణాష్టకాన్ని కలిగిన దహరశబ్దవాచ్యునిగా ఉపనిషద్వాక్యాల వల్ల తెలుసుకుంటున్నారు) అని అన్నారు. "దహ్రం విపాప్మం పరవేశ్మభూతం యః పుండరీకం పురమధ్యసంస్థమ్, తత్రాపి గహనం దహ్రం విశోకః తస్మిన్ యదంతః తదుపాసితవ్యమ్" (శరీరం మధ్యలో ఉన్నది, ఏ దోషం లేనిది, పరమాత్మకు నివాసస్థానమైనది అయిన చిన్న హృదయం అనే కమలం ఏది ఉన్నదో, అందులో చాలా చిన్నవాడు, ఏ దోషస్పర్శ లేనివాడు, దహరకాశశబ్దం చేత చెప్పబడేవాడైన నారాయణుడు ఉన్నాడు. అతనిలో ఉండే కళ్యాణగుణాలు ఉపాసించదదగినవి) అనే ఉపనిషద్వాక్యం స్మరించదగినది.

మన లోపల దహరాకాశమనేవి రెండు ఉన్నాయి. పైన ప్రస్తావించిన ఉపనిషత్తులో" పరవేశ్మభూతమ్" అని పలికిన విధంగా పరమపురుషునకు ఆధారమైన దహరపుండరీకం "కీ‌ళ్ వానమ్" అని చెప్పబడుతున్నది. అందులో వేంచేసి ఉండే భగవానుడుకూడా దహరశబ్దంచేత చెప్పబడుతున్నాడు, కనుక, అతనికి "మేల్ వానమ్" అని పేరు. ఆ స్వామికి ఆధారమైన దహరాకాశం "కీ‌ళ్ వానమ్" అని అనబడుతున్నది. అది పరిశుద్ధంగా ఉంటే తప్ప, మేల్వానం అనబడే భగవానుడు అందులో వేంచేసి ఉండడు. కనుక, "కీ‌ళ్ వానమ్" స్వచ్ఛంగా, పరిశుద్ధంగా ఉండాలని భావం. " ఆశంసాయామ్ భూతవచ్చ" అనే సంస్కృతవ్యాకరణన్యాయానుసారంగా అది పరిశుద్ధం కావాలి – అని ఆశంసింపబడుతున్నది – అనే అర్థాన్ని ఇక్కడ గ్రహించాలి.

ఇది మహావిద్వాన్ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్య స్వామివారి వ్యాఖ్యాన వైఖరి.

ఇక, ప్రవచన శిరోమణి శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారి వ్యాఖ్యాన సరణిని గమనిద్దాం. వారి వ్యాఖ్యానాన్ని అనుసరించి 14వ పాశురంలో ఈ దహరవిద్యా ప్రస్తావన చేయబడినది.

ఈ పాశురంలో నిద్ర లేపబడే గోపిక అంతర్యామి ఉపాసనాన్ని చేస్తున్నది. ఈ ఉపాసనయే దహరవిద్య. "దహ్రం విపాప్మమ్" ఇత్యాది ఉపనిషద్వాక్యం శరీరంలో మధ్య భాగంలో ఉండే పుండరీకం ఏ దోషం లేనిది, సూక్ష్మమైనది, పరమాత్మకు నివాసస్థానమై ఉండేది –అని తెలుపుతున్నది. ఉపాసకుని శరీరంలో దహరమనే పేరుతో పరమాత్మ హృదయస్థానంలో సూక్ష్మరూపంలో ఆ ఉపాసకుని అనుగ్రహించడంకోసం వేంచేసి ఉంటాడు. ఆ పరమాత్మను ఉపవాసించడమే దహరవిద్య పరమాత్మను ఉపాసించేటప్పుడు కేవలం పరమాత్మనే కాక, ఆ పరమాత్మలో ఉండే కళ్యాణ గుణాలను కుడా ఉపాసిస్తారు. ఈ విధంగా కళ్యాణ గుణ విశిష్టుడైన పరమాత్మను ఉపాసించడానికి పూర్ణోపాసన అని పేరు. ఈ 14వ పాశురంలో ప్రబోధింపబడే గోపిక తన పెరటి తోటలో దిగుడు బావులలో ఉండే తామరలు, కలువలు మొదలైనవానిని చూస్తూ, పెరటి తోటలో ఉన్నట్లు చెప్పబడడంచేత, ఈమె దహరోపాసనం చేస్తున్నట్లు ఊహించవచ్చు. "నంగాయ్!" – పూర్ణురాలా! అని సంబోధించడంచేత ఈమె కేవలం పరమాత్మనే కాక, ఆ పరమాత్మలో ఉండే కళ్యాణంగుణాలను కూడా ఉపాసన చేస్తున్నందువల్ల పూర్ణోపాసనానిష్ఠయై, పూర్ణురాలు అయిందని చెప్పవచ్చు.

ఇది, ఈ ప్రబంధంలో దహన విద్యాప్రస్తావన చేయబడిన వైనం. సహృదయులైన విజ్ఞులు ఇంకా వేరు రీతులలో కూడా ఈ విద్యాప్రస్తావనకు సంబంధించిన సంభావన చేయవచ్చు.

★★★★★

# తిరుప్పావై ప్రబంధంలో సంవర్గ విద్యా ప్రస్తావన

ఉపనిషత్తులలో ప్రస్తావింపబడిన బ్రహ్మావిద్యలలో సంవర్గవిద్య ఒకటి. ఇది ఛాందోగ్యోపనిషత్తులోని రైక్వ జానశ్రుతి సంవాదంద్వారా తెలియజేయబడింది.

మహావృషదేశాన్ని జానశ్రుతి పౌత్రాయణుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. ఆయన గొప్పదాత. ఏమి దానం చేసినా, దానిని శ్రద్ధగా ఇచ్చేవాడు. ప్రతి ఊరులోనూ, వాడలోను ఇళ్లను కట్టించి ఇచ్చాడు. తన రాజ్యంలో అంతట అతడు పండించే పంటలకు అంతు లేదు. తన దేశంలోని ప్రజలంతా కాను కట్టించిన ఇళ్లలో ఉంటూ తాను పండించిన అన్నాన్ని తింటూ సుఖంగా ఉండాలని, ఉన్నారని భావించేవాడు.

ఈ విధంగా ఉండగా ఒకనాటి రాత్రి ఇతని అన్నదానాన్ని గూర్చి, అతడు ఎల్లప్పుడూ ఇళ్లను కట్టించి ప్రజలకు ఇచ్చే గొప్ప వ్రతాన్ని గూర్చి విని, చాలా సంతోషించిన కొందరు మహాత్ములు హంసరూపాలలో ఆకాశంలో ఎగురుతూ ఆ జానశ్రుతికి కనిపించారు.

జ్ఞానశ్రుతి, తాను ప్రజలకు అందరికీ గృహాలను కట్టిస్తున్నానని, పంటలను పండించి వారికి అన్నాన్ని సమకూరుస్తున్నాననే భావంతోనే ఉండేవాడు. ఆ భావంతోనే ఆ సత్కార్యాలను చేసేవాడు. తప్ప, భగవంతుడే చేసేవాడు, చేయించేవాడు. అంతా ఆ పరమాత్మదే అని తెలియక, అహంకారంతో, మమకారంతో ఉండేవాడు. ఆ కార్యాలను చేసేవారు.

ఈ ప్రభువు మంచి కార్యాలను చేస్తున్నా మంచివాడే కానీ అతనిలో ఈ అహంకారం తొలగి ఏర్పడితే బాగుండునని అనుకున్నారు ఆ మహాత్ములు దానికి తగినట్లుగా మాట్లాడుతూ ఆకాశంలో అతని సమీపంలో సంచరించసాగారు.

అది రాత్రి సమయం. జానశ్రుతి తన సౌధం పై భాగంలో శయనించి ఉన్నాడు. హంసలు మాట్లాడే మాటలను అతడు విన్నాడు. అతడికి పక్షిభాష తెలుసు. కనుక అవి మాట్లాడే మాటలలోని అర్థాన్ని గ్రహించాడు.

ఆ హంసలలో ఒక హంస ఇంకొక హంసతో “ఎందుకంత తొందరగా పోతున్నావు? మన కింద ధర్మాత్ముడైన జానశ్రుతి ఉన్నాడు, గమనించలేదా? ఆయన విషయంలో అపచార పడకు. కళ్ళు పోతాయి, జాగ్రత్త!” అని అన్నది. దానికి సమాధానంగా ఇంకొక హంస “ఈయన రైక్వుడంతటివాడు అన్నట్లుగా మాట్లాడుతున్నావే! ఇంతకు ఈ జానశ్రుతి గొప్పతనం ఏమిటి? “అని అన్నది.

అప్పుడు మొదటి హంస “రైక్వుడు అంతటి గొప్పవాడా? ఆయన గొప్పతనం ఏమిటి? చెప్పు, వింటాను “అని అన్నది.

“రైక్వుడు మహాజ్ఞాని. ఆయనకి తెలియనిది ఏదీ లేదు. ఈ లోకంలోని జ్ఞానం అంతా ఆయనకు ఉన్నది. ఆయన బ్రహ్మజ్ఞుడు” అని అన్నది, వేరొక హంస. ఈ సంభాషణను అంతటిని జానశ్రుతి విన్నాడు. అతడి మనస్సులో ఉండే అహంకారం అంతా తొలగిపోయింది. ఏ విధంగా అయినా రైక్వుని దగ్గరకు వెళ్ళి, ఆయన దగ్గర బ్రహ్మజ్ఞానాన్ని పొందాలని నిశ్చయించుకున్నాడు.

తన పరిచారకులను దేశం అంతటా పంపించి, చాలా కష్టంతో ఓ పల్లెలో ఒక బండి కింద శరీరాన్ని గోక్కుంటూ ఉండే రైక్వుని ఆచూకీని అతడు తెలుసుకున్నాడు. ఏడు వందల ఆవులను, ఒక రత్నాల కంఠహారాన్ని, ఒక రథాన్ని

తీసుకుని వెళ్లి, వాటిని గ్రహించి, ఆ రైక్వుడు ఉపాసించే దేవతను గూర్చి తనకు ఉపదేశించమని జానశ్రుతి అతనిని అర్థించాడు.

"ఇవన్నీ నాకెందుకు? నీవే ఉంచుకో, వెళ్ళిపో" అన్నాడు, రైక్వుడు. కానీ జ్ఞాన శృతి తన పట్టును విడవకుండా, వేయి ఆవులు, కంహారం రథంతో పాటు తన కుమార్తెను కూడా భార్యగా స్వీకరించమని, ఆ రైక్వుడు ఉంటున్న గ్రామాన్ని కూడా అతనికి సమర్పించి, ఈ దక్షిణలను అన్నిటినీ స్వీకరించి తనకు జ్ఞానోపదేశం చేసి తరింప చేయమని ప్రార్థించాడు, జానశ్రుతి. అతని అభినివేశాన్ని, అహంకార రాహిత్యాన్ని గమనించిన రైక్వుడు ఆ దక్షిణలను అన్నిటినీ స్వీకరించి, అతనికి బ్రహ్మవిద్యను ఉపదేశం చేస్తానని అన్నాడు. ఆ ఉపదేశమే సంవర్గ విద్య.

"వాయుర్వా వ సంవర్గః యదా వా అగ్ని రుద్వాయతి వాయుమేవాప్యేతి, యదా సూర్యో ఽ స్తమేతి వాయు మేవాప్యేతి, యదా చంద్రో ఽ స్తమేతి వాయు మేవాప్యేతి, యదా ఽపః ఉచ్ఛుష్యంతి వాయు మేవాపియంతి, వాయు ర్హ్యేవైతాన్ సర్వాన్ సంవృక్త ఇత్యధిదైవతమ్".

సంవర్గం అంటే ఒకటిగా చేసి తనలో చేర్చుకోవడం. వాయువులో సంవర్జనం గుణం ఉంది. అగ్ని రివాయువులో చేరుతుంది సూర్య చంద్రులు అస్తమించి వాయువులో చేరుతారు. మనీరు ఇంకి వాయువులో చేరుతుంది. వాయుదేవతే అన్ని భూతాలను సంగ్రహించి తనలో చేర్చుకుంటుంది. అందువల్ల వాయువే సంవర్గం అన్న మాట. దేవవిషయక సంవర్గం ఇది. ఇది అధిదైవతం. ఇక్కడ వాయువు అంటే, కేవలం వాయువు కాదు, వాయువును శరీరంగా కలిగిన పరమాత్మయే.

"అథాధ్యాత్మమ్. ప్రాణో వావ సంవర్గః. స యదా స్వపితి ప్రాణమేవ వాగప్యేతి. ప్రాణం చక్షుః, ప్రాణం శ్రోత్రం, ప్రాణం మనః, ప్రాణో హ్యేవైతాన్ సర్వాన్ సంవృక్త ఇతి. తౌవా ఏతౌ ద్వౌ సంవర్గౌ వాయురేవ దేవేషు ప్రాణః ప్రాణేషు."

ప్రాణం సంవర్గం. పురుషుడు నిద్రించేటప్పుడు వాక్కు, కన్ను, చెవి, మనస్సు ప్రాణంలోనే చేరి లయమవుతున్నాయి. ప్రాణమే సంవర్గం. పై వాయువు వంటిదే ఈ ప్రాణంకూడా. ఇక్కడ ప్రాణం అంటే, ప్రాణాన్ని శరీరంగా కలిగిన పరమాత్మయే. ఆ వాయువు, ఈ ప్రాణం, రెండు పరమాత్మనుంచి వచ్చినవే. ఆయన యందు చేరుతున్నవే. అందువల్ల పరమాత్మయే సంవర్గం.

ఇక్కడ రైక్వుడు ఈ విద్యా వైభవాన్ని తెలుపడం కోసం ఒక కథను చెబుతాడు.

శౌనకుడు, అభిప్రతారి అనే ఇద్దరు బ్రహ్మవిద్యానిష్ఠులు భోజనానికి కూర్చుని ఉండగా, ఒక బ్రహ్మచారి అక్కడకు బిక్ష కోసం వచ్చాడు. ఆ బ్రహ్మచారి తాను సంవర్గ విద్యా నిష్ఠుడననే దురభిమానంతో ఉన్నాడు. ఆ విషయాన్ని తెలిసిన ఆ బ్రహ్మచారి ఏమంటాడో విందామని వారు అతనికి బిక్ష పెట్టలేదు. అపుడు ఆ బ్రహ్మచారి "అగ్ని, ఆదిత్య, చంద్ర, జలరూపాలను, వాక్ చక్షుః శ్రోత్ర మనోరూపాలను ప్రజాపతి తనలో చేర్చుకుంటున్నాడు. ఈ విధంగా అనేక రూపాలలో ఉండే ప్రజాపతిని మీరు తెలుసుకోలేక పోతున్నారు. నేను భిక్షను అడుగుతున్నానంటే, ప్రజాపతి కోసమే అని గుర్తించకుండా, మీరు నన్ను ఉపేక్షిస్తున్నారే!"అని అన్నాడు.

అప్పుడు శౌనకుడు ఆ బ్రహ్మచారి దగ్గరకు వెళ్లి, " దేవతలకు నియంత, ప్రజలను సృష్టించేవాడు, ఇతరులచే తాను తినబడకుండా, అంటే, నాశాన్ని పొందకుండా, అంతటినీ తాను భక్షించేవాడు అయిన పరమాత్మే సంవర్గం.

అటువంటి పరమాత్మనే మేము ఉపాసిస్తున్నాము. అంతేకానీ, నువ్వు అనుకునే ప్రజాపతి రూపుడైన సంవర్గాన్ని కాదు. పరమాత్మే సంవర్గం. ఆయనే ఉపాసించదగినవాడు" అని సమాధానం చెప్పి, అతనికి బిక్ష పెట్టమని తన పరిచారకులను ఆజ్ఞాపించాడు.

ఈ కథను చెప్పిన తరువాత రైక్వుడు ఈ విధంగా అన్నాడు. " జానశ్రుతీ! విన్నావా? నీకు తెలియకుండానే, నీ ప్రమేయం లేకుండానే, ఈ ప్రపంచం అంతా సాగుతోంది. నీవు సమకూర్చిన అన్నం తిని, నీవు కట్టించిన ఇళ్లలో నివసించి, జనం బతుకుతున్నారని నువ్వు అనుకుంటున్నావు. కానీ, ఈ వస్తువులు అన్నీ సంవర్గ శబ్దం చేత చెప్పబడే పరమాత్మవే. అతడే వాటిని భక్షిస్తాడు –అని గ్రహించు". అని అన్నాడు.

ఈ విధంగా సంవర్గ విద్యను రైకుడు జానశ్రుతికి ఉపదేశించాడు. సంగ్రహంగా ఇది సంవర్గ విద్యా స్వరూపం.

అయితే, ఈ విద్యాప్రస్తావన తిరుప్పావై ప్రబంధంలో ఎక్కడ చేయబడింది? అని గమనించి చూస్తే, ఆయా శబ్దాల ప్రయోగ స్వారస్యాన్ని బట్టి ఆరవ పాశురం ఆరంభంలో ఈ విద్య సూచింపబడిందని భావించవచ్చు. ఈ పాశురం ఆరంభం "పుళ్ళుమ్ శిలంబిన కాణ్" అని ఆరంభం అవుతున్నది ఇక్కడ పక్షులు ధ్వనిస్తున్నాయి అని అనడం హంసపక్షుల సంభాషణరూపాలైన ధ్వనులను సూచిస్తున్నాయి అని భావించవచ్చు. హంసల సంభాషణ వల్లనే కదా, సంవర్గ విద్యా ప్రసక్తి ఉపనిషత్తులలో ఏర్పడింది. శారీరక మీమాంసలో ఈ విద్యాప్రసక్తి " శుగస్య తదనాదరశ్రవణాత్ తదా ఽఽ ద్రవణాత్ సూచ్యతే హి" (1–3–33) (హంస పలికిన అనాదరవాక్యాన్ని వినడం వల్ల అప్పుడు జానశ్రుతి రైక్వుని ఉద్దేశించి వెళ్లడంచేత, అతనికి కలిగిన, బ్రహ్మజ్ఞానవిషయకమైన శోకం సూచింపబడుతున్నది కదా!) అనే సూత్రం వ్యాఖ్యానంలో ప్రస్తుతమైనది.

★★★★★

# తిరుప్పావై ప్రబంధంలో అంతరాదిత్యవిద్యాప్రస్తావన

వేదాంతాలలో అంతరాదిత్యవిద్యాప్రస్తావన ఛాందోగ్యోపనిషత్తులో కనిపిస్తుంది. ఇది, ఆ ఉపనిషత్తులో ఆఱవ ఖండంలో ప్రస్తావింపబడింది. ఆదిత్యమండలంలో అంతర్యామిగా ఉండే పరమపురుషుని రమణీయమైన రూపాన్ని ఈ ఖండంలో ఈ విధంగా ఛాందోగ్యం తెలియజేసింది.

"య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః.
తస్య కప్యాసం పుండరీకమేవ మక్షిణీ, తస్య ఉదితి నామ సర్వేభ్యః పాప్మభ్యః ఉదితః. ఉదేతి హ వై సర్వేభ్యః పాప్మభ్యః. య ఏవం వేద."

ఆదిత్య మండలం లోపల అందంగా ఉండే ఏ పురుషుడు ఉపాసకులచేత దర్శింపబడుతున్నాడో, ఏ పురుషుడు అందమైన మీసాలను, కేశాలను కలిగినవాడై, కాలి గోళ్ళనుండి మొదలుకొని శరీరం అంతా బంగారం వలె ఆకర్షణీయమైన అవయవాలను కలిగి ఉన్నాడో, అతడు సూర్యునిచే వికసింప చేయబడినది, నిండయిన నీటిలో ఉన్నది, బలమైన కాడపై ఉన్నది అయిన తెల్ల తామరవంటి నిర్మలమైన, విశాలమైన నేత్రాలను కలిగినవాడై ఉన్నాడు. అతనికి "ఉత్" అని పేరు. అతడు ఏ పాపాల సంబంధం లేనివాడు. కనుక "ఉత్" అని చెప్పబడుతున్నాడు. పరమపురుషుని ఈ విధంగా ఉపాసించినవాడు అన్ని పాపాలనుండి విముక్తుడు కాగలడు)

పై ఉపనిషద్వాక్యాలను బట్టి ఈ క్రింది విషయాలు మనకు తెలుస్తున్నాయి.

ఆదిత్య మండలంలో పరమ పురుషుడు ఉన్నాడు. అతని రూపం బంగారంవలే గొప్పగా ప్రకాశిస్తూ ఉంటుంది. రమణీయమైన జుట్టును, మీసాలను కలిగినవాడు. కాలిగోళ్ళ నుండి శిఖపర్యంతం అందమైన అవయవాలను కలవాడు. అతని రెండు కన్నులు తామర పూలవలె అందంగా ఉంటాయి– అని పై వాక్యాలు

చెబుతున్నందువల్ల భగవంతునకు అందమైన దివ్యమంగళ విగ్రహం ఉన్నదని తెలుస్తున్నది.

పైన ప్రస్తావించిన శ్రుతివాక్యంలో "అక్షిణీ" అనే పదం రెండు కన్నులు అనే అర్థన్ని చెబుతున్నందువల్ల, ఆ భగవంతుడు మూడు కన్నులు కలవాడైన శివుని కంటే, వేయి కన్నులను కలవాడైన ఇంద్రుని కంటే, ఎనిమిది కన్నులను కలవాడైన బ్రహ్మ కంటే వేరయినవాడని తెలుస్తున్నది. ఆ భగవానుని నేత్రాలు తామర పూలవంటివి అని అనడం వల్ల, అతడు పుండరీకాక్షుడుగా పేరుబడిన శ్రీమన్నారాయణుడే తప్ప, ఇంకొకడు కాడని నిశ్చయింపబడినట్లయినది.

ఇక్కడ, శ్రుతివాక్యంలో ప్రయోగింపబడిన పుండరీకశబ్దం కోశప్రసిద్ధినిబట్టి తెల్ల తామరపువ్వు అనే అర్థాన్ని ఇచ్చేది అయినప్పటికీ, వేదోపబృంహణం అయిన శ్రీరామాయణంలోని సూక్తిబలంవల్ల, వేదపరమార్థవిదులైన ఆళ్వారుల పలు సూక్తులనుబట్టి కొద్దిపాటి ఎరుపు రంగును కనుకొనలలో కలిగిన, తెల్ల తామరలవంటి నేత్రాలను కలవాడు, భగవానుడు – అని ఏర్పడుతున్నది.

శ్రీరామాయణం సుందరకాండలో సీతాదేవి హనుమంతునితో పలికే సందర్భంలో, శ్రీరాముని దర్శించలేక తాను క్లేశపడుతున్న విషయాన్ని తెలిపేటప్పుడు,

"సాహం కథం కరిష్యామి తం వినా ప్రియదర్శినమ్,
రామం రక్తాంతనయన మపశ్యంతీ సుదుఃఖితా"

(శ్రీరామాయణం – సుందరకాండ – 26 –37)

(కొద్దిపాటి ఎరుపు రంగును కనుచివరలో కలిగిన అందమైన నేత్రాలను కలిగినవాడై, అందమైన దివ్యమంగళరూపాన్ని కలిగినవాడైన శ్రీరాముని చూడకుండా ఉండే నేను మిక్కిలి దుఃఖించేదాననై ఏమి చేయగలను?) అని పలికిన సూక్తి వల్ల, శెవ్వరియోడు నీండ అప్పెరియవాయ కణ్ గళ్" (అమలనాది పిరాన్) (ఎర్రని రేఖలతో కూడిన, విశాలమైన గొప్ప నేత్రాలు) అని మొదలైన పలు దివ్యసూరి సూక్తులవల్ల భగవంతుని నేత్రాలు పర్యంతభాగంలో కొద్దిపాటి ఎరుపును కలిగి

ఉంటాయి – అని తెలుస్తున్నది. శబర స్వామికూడా పుండరీక శబ్దానికి ఎరుపు రంగుతో కూడిన తామరపువ్వు – అని వ్యాఖ్యానం చేశారు.

ఇటువంటి రమణీయరూపాన్ని కలిగినవాడు, ఆదిత్య మండలం లోపల అంతర్యామిగా వేంచేసి ఉన్నవాడు అయిన పరమపురుషుని ఉపాసననే అంతరాదిత్య విద్య తెలుపుతున్నది.

ఈ విద్యా ప్రస్తావన తిరుప్పావై ప్రబంధంలో 14వ పాశురంలోని "శంగొడు శక్కర మేందుమ్ తడక్కైయన్, పంగయ క్కణ్ణానై" (శంఖచక్రాలను ధరించిన విశాలమైన బాహువులను కలవాడు, పుండరీకాక్షుడైన స్వామిని) అనే సూక్తిలో చేయబడిందని భావించవచ్చు.

ఇక్కడ ఇంకొక విశేషాన్ని కూడా స్మరించాలి. గాయత్రీ మంత్రం ఈ అంతరాదిత్యుడైన పరమపురుషుని ఉపాసననే తెలుపుతున్నది. ప్రతిదినం మూడు సంధ్యలలో చేయబడే సంధ్యావందనంలో గాయత్రీమంత్రజపం పూర్తి అయిన తరువాత, పౌరాణికమైన ఈ క్రింది శ్లోకంతో ఆదిత్యమండలంలో అంతర్వర్తిగా ఉండే పరమపురుషుని రూపం ధ్యానింపబడుతున్నది. ఆ శ్లోకం ఏమంటే,

"ధ్యేయ స్సదా సవితృమండలమధ్యవర్తీ
నారాయణః సరసిజాసన సన్నివిష్టః,
కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయవపుః ధృతశంఖచక్రః"

(ఆదిత్యమండలం లోపల అంతర్యామిగా నెలకొని ఉండేవాడు, పద్మాసనంలో కూర్చుని ఉన్నవాడు భుజకీర్తులను, మకర కుండలాలను, కిరీటాన్ని, హారాలను కలిగినవాడు, బంగారువలె మెరిసే రూపాన్ని కలిగినవాడు, శంఖచక్రాలను ధరించినవాడు అయిన పరమపురుషుడు ధ్యానించదగినవాడు) అనేది.

ప్రస్తుత పాశురంలోని "శంగొడు శక్కర మేందుమ్ తడక్కైయన్" అనే ప్రయోగం కూడా ఈ విద్యాప్రస్తావనను సూచిస్తున్నదని భావించడంలో అడ్డులేదుకదా.

★★★★★

# తిరుప్పావైలో మూడు చోట్ల లక్ష్మీదేవి

తిరుప్పావై ప్రబంధంలో లక్ష్మీస్వరూపిణి అయిన నీళాదేవికి సంబంధించిన ప్రస్తావన వరుసగా మూడు పాశురాలలో, అంటే, 18వ, 19వ, 20వ పాశురాలలో గోచరిస్తుంది. ఈ విధంగా మూడుసార్లు పురుషకారస్వరూపిణి అయిన నీళాదేవీప్రస్తావన ఈ ప్రబంధంలో చేయబడడంలో ఉండే కొన్ని స్వారస్యాలను గమనిద్దాం.

ఈ తిరుప్పావైప్రబంధం అష్టాక్షరీమంత్రార్థప్రతిపాదకమని విజ్ఞులైన మన పూర్వాచార్యులు భావించి, వ్యాఖ్యానం చేసిన విషయం సుప్రసిద్ధం. 17వ పాశురంలో ఆరంభంలోనే ఈ మంత్రోద్ధారక్రమం సూచింపబడింది. "అంబరమే" అనే శబ్దం ప్రణవాన్ని, "తణ్ణీరే" అనే శబ్దం నమస్సును, "శోఱే" అనే శబ్దం "నారాయణాయ" అనే మూడవ పదాన్ని సూచిస్తున్నవని భావించవచ్చునని ఇంతకు ముందే ఒక వ్యాసంలో విన్నపించడం జరిగింది.

ఈ విధంగా ముందు పాశురంలో అష్టాక్షరీమంత్రప్రస్తావన చేసిన గోదాదేవి, తరువాత అనుగ్రహించిన మూడు పాశురాలలోను లక్ష్మీసంబంధాన్ని సూచించే నీళాదేవి ప్రస్తావనను చేయడం ఒక సాంప్రదాయికమైన విషయాన్ని స్మరింప జేస్తున్నదని భావించవచ్చు.

అష్టాక్షరీమంత్రంలోని మొదటి పదం ప్రణవం. ఈ ప్రణవం, అకార, ఉకార, మకారాలు అనే మూడు వర్ణాల సంపుటి. ఈ మూడు అక్షరాలను మూడు వేరు వేరు, అర్థవంతాలైన పదాలుగా భావించి, వాటిని మన పూర్వాచార్యులు వ్యాఖ్యానించారు. అకారం, సర్వశేషి అయిన భగవంతుని, ఉకారం, జీవుడు

భగవంతునకు మాత్రమే శేషం– అనే అవధారణార్థాన్ని, మకారం, భగవంతునకు శేషభూతుడైన జీవుని తెలియజేస్తున్నవని ఒక వివరణం కాగా, అ కారం భగవంతుని, ఉకారం లక్ష్మీదేవిని, మకారం జీవుని తెలియజేస్తున్నవని వేరొక వివరణం.

భగవంతుని రక్షకత్వాన్ని తెలియజేసే అకారంలో లక్ష్మీసంబందాన్ని అర్థాన్నిబట్టి సంభావన చేయాలని మన పూర్వాచార్యులు అందరూ అభిప్రాయపడ్డారు. లక్ష్మీసహితుడైన నారాయణునిలోనే రక్షకత్వం పరిపూర్ణంగా ఉంటుంది అనేది శ్రీవైష్ణవసిద్ధాంతం. ఇది శ్రీరామాయణం మొదలైన ఉపబృంహణ గ్రంథాలలో నిరూపింపబడిందనికూడా వారి వివరణం. ముముక్షుప్పడి అనే రహస్యగ్రంథంలో శ్రీపిళ్ళైలోకాచార్యులవారు తిరుమంత్రప్రకరణంలో అకారార్థాన్ని వివరిస్తూ, " రక్షిక్కుమ్బోదు పిరాట్టి సన్నిధి వేండుకై యాలే ఇదిలే శ్రీసంబంధమ్ అనుసంధేయమ్" (భగవంతుడు జీవులను రక్షించేటప్పుడు లక్ష్మీసాన్నిధ్యం ఆవశ్యకం కనుక, ఈ అకారార్ధంలో లక్ష్మీసంబంధాన్ని అనుసంధించాలి) అని అన్నారు. ఈ సూక్తిని వ్యాఖ్యానించేటప్పుడు, సర్వజ్ఞులైన శ్రీవరవరమునులు " లక్ష్మ్యా సహ హృషీకేశః దేవ్యా కారుణ్యరూపయా, రక్షకః సర్వసిద్ధాంతే వేదాంతేషు చ గీయతే" (కరుణాస్వరూపిణి అయిన లక్ష్మీదేవితో కలసి ఉండేవాడైన భగవంతుడే రక్షకుడు అని శ్రీపాంచరాత్రంలోనూ, వేదాంతాలలోనూ కీర్తింపబడుతున్నది) అనే పాంచరాత్ర సూక్తిని ప్రమాణీకరించి వ్యాఖ్యానించారు.

ఈ విధంగా అకారార్థంలో భాసించే లక్ష్మీసంబంధం చెప్పబడినట్లయినది.

ఇక, రెండవ అక్షరం అయిన ఉకారంకూడా లక్ష్మీదేవిని నిర్దేశిస్తున్నది. ఈ ఉకారార్థాన్ని వివరించే సందర్భంలో శ్రీపిళ్ళైలోకాచార్యులవారు "పెరియపిరాట్టియార్ క్కు శేషమెన్గిఱదెన్నుమ్ శొల్లువర్ కళ్" (ఈ ఆత్మ, లక్ష్మీదేవికి

కూడా శేషం – అని కూడా అంటారు) అనే పలికిన సూక్తిని శ్రీవరవరమునులు వ్యాఖ్యానిస్తూ, "అకారః చిత్స్వరూపస్య విష్ణోః వాచక ఇష్యతే, ఉకారః చిత్స్వరూపాయాః శ్రియో వాచి తథా విదుః, మకారస్తు తయో ర్దాస ఇతి ప్రణవలక్షణమ్" (ఆకారం చిత్స్వరూపుడైన విష్ణువును తెలుపుతున్నది, ఉకారం అయిన లక్ష్మీదేవిని తెలుపుతున్నది అని అంటారు, ఇక, మకారం అయితే, ఈ దివ్య దంపతులకు దాసుడు –అనే ఇది ప్రణవార్థం) అనే ప్రమాణాన్ని, "అకారేణోచ్యతే విష్ణుః సర్వలోకేశ్వరో హరిః, ఉద్ధృతా విష్ణునా లక్ష్మీ ఉకారేణోచ్యతే సదా, మకారస్తు తయోః విప్ర! శ్రీనారాయణయో స్సదా, ఆత్మనః శేషభూతస్య వాచకః శ్రుతిచోదితః" (అకారం ద్వారా సర్వలోకాలకు ప్రభువైన హరి, విష్ణువు చెప్పబడుతున్నాడు ఆ భగవంతునిచేత ధరింపబడే లక్ష్మీదేవి ఉకారంచేత చెప్పబడుతున్నది బ్రాహ్మణా! మకారంచేత అయితే, ఆ లక్ష్మీనారాయణులకు ఎల్లప్పుడూ ఆత్మ శేషభూతుడు అనే, వేదాలచేత తెలియబడే అర్థం చెప్పబడుతున్నది) అనే రెండు పంచరాత్ర ప్రమాణాలను ఉదాహరించి ఉకారం లక్ష్మీవాచకమనే విషయాన్ని వివరించారు.

ఈ అర్థాన్ని శ్రీరామాయణంకూడా "అగ్రతః ప్రయయౌ రామః సీతా మధ్యే సుమధ్యమా పృష్ఠత స్తు ధనుష్పాణిః లక్ష్మణో ఽ నుజగామ హ" (వనవాసానికి వెళ్లేటప్పుడు, శ్రీరాముడు ముందు వెళ్ళాడు. చక్కని నడుమును కలిగిన సీతాదేవి మధ్యలో వెళ్ళింది. వారి వెనుక విల్లును చేతిలో ధరించిన లక్ష్మణుడు అనుసరించి వెళ్ళాడు కదా! ఆహా!) అనే శ్లోకంలో నిరూపించింది– అని సోమాశియాండాన్ అనే పూర్వాచార్యులు ఒకరు వివరించేవారు. – ఆని ఎంబార్ జీయర్ అనే పూర్వాచార్యులు వేదోపబృంహణప్రమాణాన్ని చూపించారు. అందుచేత, ఈ అర్థం

శ్రీరామాయణ సమ్మతం అని స్పష్టపడుతున్నది. ఇది ఉకారంలో లక్ష్మీసంబంధ నిరూపణం.

ఈ విధంగానే, ప్రణవంలోని మూడవ అక్షరం అయిన మకారంలోకూడా లక్ష్మీ సంబంధాన్ని భావించవచ్చు. ఏ విధంగా? అంటే, మకారం జీవవాచకం. జ్ఞానస్వరూపుడైన, జ్ఞాత అయిన, అణుపరిమాణుడైన జీవుని క్రమంగా" మన– జ్ఞానే, మను – అవబోధనే, మసి –పరిమాణే" అనే మూడు ధాతువులనుండి పుట్టిన పదంగా భావించడానికి వీలున్న మకారం నిర్దేశిస్తున్నది.

తెన్నాచార్య సంప్రదాయంలో లక్ష్మీదేవి జీవకోటిలోనికి చేరుతుంది. కనుక ఈ మకారం లక్ష్మీవాచకంకూడా అనేది సిద్ధం.

ఈ విధంగా, ప్రణవంలో – లక్ష్మీదేవికి అకారం, ఉకారం, మకారం– అనే మూడు పదాలలోనూ కల సంబంధాన్ని సూచిస్తూ గోదాదేవి వరుసగా మూడు పాశురాలలో లక్ష్మీస్వరూపిణి అయిన నీళాదేవీప్రస్తావనను చేసినదని సంభావించవచ్చు. ఈ అర్థం, ఇంతకు ముందు వివరించిన రీతిలో, పాంచరాత్రశాస్త్రార్థానుగుణం కావడంకూడా గమనించదగినది.

ఇంకొక విశేషం ఏమంటే, ఈ మూడు పాశురాల ఆరంభం ఉకార ఘటితంగానే ఉండడం. 18వ పాశురం ముందు అని నేరుగా ఉకారంతోనే ఆరంభం అవుతున్నది. ఇక మిగిలిన రెండు పాశురాలు కూడా "కుత్తు విళక్కు, ముప్పత్తు" అని ఒక ఉకారఘటితాలైన అక్షరాలతోనే ఆరంభం అవుతున్నాయి. ఉకారం లక్ష్మీవాచకం అనే విషయం ఇంతకు ముందే సూచింపబడింది కదా.

★★★★★

# తిరుప్పావైలో నీళాదేవి ప్రస్తావన

మనం భగవదాలయాలకు వెళ్ళినప్పుడు, అక్కడ మహాలక్ష్మిని మూడు చోట్ల సేవిస్తాము. మూడు వేరు వేరు దశలలో దర్శిస్తాము.

ముందుగా, లక్ష్మీదేవిని, ఆమెకు ప్రత్యేకంగా నిర్మించబడిన సన్నిధిలో సేవిస్తాము. సామాన్యంగా కోవెలలో లక్ష్మీదేవికి ప్రత్యేకమైన ఆలయం ఉంటుంది కొన్ని ఆలయాలలో ప్రత్యేకమైన మందిరం లేకపోయినా, భగవంతుని సన్నిధిలోనే లక్ష్మీదేవిమూర్తి ప్రత్యేకంగా దర్శనమిస్తుంది. ఈ విధంగా ముందుగా లక్ష్మీదేవిని సేవించడం ఆమె ప్రత్యేకంగా ఉండే సన్నివేశంలో. భగవంతుని దర్శించడానికి ముందుగానే ఈ లక్ష్మీదేవిని సేవించడం శ్రీవైష్ణవ సంప్రదాయం.

తరువాత భగవంతుని మందిరంలోకి వెళ్ళినప్పుడు భగవన్మూర్తికి ఇరు వైపులా భూదేవి, శ్రీదేవి దర్శనమిస్తారు. ఈ సన్ని వేశంలో రెండవ మారులు లక్ష్మీదేవిని సేవిస్తాము.

తరువాత, భగవంతుని మూర్తిని సేవించినప్పుడు, ఆ మూర్తి వక్షస్సులో వేంచేసి ఉండే లక్ష్మీదేవిని మూడవసారి సేవిస్తాము.

తిరుపతిలో, ముందుగా, తిరుచానూరులో ప్రత్యేకమైన ఆలయంలో వేంచేసి ఉండే పద్మావతీదేవిని ముందుగా సేవిస్తాము. కొండమీదకు వెళ్ళినప్పుడు ఉత్సవమూర్తిని సేవించినప్పుడు ఆ మూర్తికి ఇరువైపులా ఉండే శ్రీదేవి, భూదేవులను సేవిస్తాము. ఇక, మూలమూర్తిని సేవించినప్పుడు, ఆ స్వామి వక్షస్సులో ఉండే వక్షఃస్థలలక్ష్మి, వ్యూహలక్ష్మి అనే ఇద్దరు మూర్తులు దర్శనమిస్తారు. ఈ విధంగా మూడు చోట్ల మనకు లక్ష్మీదేవి దర్శనం లభిస్తుంది. ఈ విధంగా ఎందువల్ల?

గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో 18 వ, 19వ, 20వ పాశురాలలో, ఈ విధంగా మూడు విధాలుగా ఉండే, దివ్యదేవేరి అయిన నీళాదేవి ప్రస్తావనను చేసినది.

ఈ మూడు పాశురాలలో, మొదటిది అయిన " ఉందు మదకళి*ఱ్ఱ*న్" అనే 18వ పాశురంలో పూర్తిగా నీళాదేవి ప్రస్తావనే గోచరిస్తుంది. ఈ పాశురాన్ని జాగ్రత్తగా గమనించాలి. ఇందులో శ్రీకృష్ణుని ప్రస్తావన ఏ మాత్రం లేదు. ఆ పాశురం ఈ విధంగా ఉన్నది.

**ఉందు మద కళి*ఱ్ఱ*న్, ఓడాద తోళ్ వలియన్ ★**
**నందగోపాలన్ మరుమగళే!, నప్పిన్నాయ్! ★**
**కందమ్ కమ*ழு*మ్ కు*ழ*లీ!, కడై తిఱవాయ్ ★**
**వందెంగుమ్, కో*ழి* అ*ழை*త్తన కాణ్ ★★ మాదవి**
**ప్పందల్ మేల్, పల్ కాల్ కుయిల్ ఇనంగళ్ కూవిన కాణ్ ★**
**పందార్ విరలి!, ఉన్ మైత్తునన్ పేర్ పాడ ★**
**శెందామరై క్కైయాల్, శీరార్ వళై ఒలిప్ప ★**
**వందు తిఱవాయ్, మగి*ழ*న్దేలోర్ ఎమ్ పావాయ్.**

ఈ పాశురంలో ఎక్కడా శ్రీకృష్ణుని ప్రస్తావన లేదు. కనుక, ఇది, ప్రత్యేకమైన ఆలయంలో వేంచేసి ఉండే లక్ష్మీదేవిని సంబంధించినదిగా భావించవచ్చు.

తరువాత, 19వ పాశురంలో, నీళాదేవి, శ్రీకృష్ణుడు అనే ఇద్దరి ప్రస్తావన గోచరిస్తుంది. ఈ పాశురంలో

**కుత్తు విళక్కెరియ, క్కోట్టు క్కాల్ కట్టిల్ మేల్ ★**
**మెత్తెన్ఱ, పంజ శయనత్తిన్ మేలేఱి ★**
**కొత్తలర్ పూంగు*ழ*ల్, నప్పినై కొంగై మేల్ ★**
**వైత్తు క్కిడంద, మలర్ మార్బా! వాయ్ తిఱవాయ్**

ఇంతవరకు ఉండే భాగం శ్రీకృష్ణునకు సంబంధించిన ప్రస్తావన.

తరువాత,

**మైత్తడమ్ కణ్ణినాయ్!, నీ ఉన్ మణాళనై ★**
**ఎత్తనై పోదుమ్, తుయిల్ ఎ*ழ* ఒట్టాయ్ కాణ్ ★**
**ఎత్తనైయేలుమ్ పిరివా*ఱ్ఱ*కిల్లాయాల్**

**తత్తువమన్ఱు, తగవు**

ఇది నీళాదేవికి సంబంధించిన ప్రస్తావన.

అమ్మా! నీళాదేవీ! శ్రీకృష్ణ భగవానునకు పక్కనే ఉండి నీవు చూస్తూనే ఉన్నావే! ఆ స్వామిని ఒక్క క్షణంకూడా విడువకుండా ఉన్నావు. మా విషయంలో పురుషకారం చేయకపోవడం నీకు ధర్మం కాదు. నీ స్వభావానికి తగినది కాదు– అని ఇందులో గోదాదేవి అంటున్నది. అందువల్ల, ఈ పాశురాన్ని భగవంతునకు పక్కనే నెలకొని ఉండే లక్ష్మీదేవిని సూచిస్తున్నదని చెప్పవచ్చు. ఇందులో " మలర్ మార్బా! వాయ్ తిరవాయ్!" అనే శ్రీకృష్ణుని ఉద్దేశించి పలుకుతున్నది. కానీ, నీళాదేవినిగూర్చి పలికేటప్పుడు ఆ విధంగా లేదు. "ఎత్తనైయేలుమ్ పిరివా*ఱ్ఱ*కిల్లాయాల్ తత్తువమన్ఱు, తగవు, "– ఈ విధంగా మమ్ములను ఉపేక్షించడం నీకు సరి కాదు. మాకోసం ఒక్క క్షణాన్ని కూడా పతివిరహాన్ని సహించలేవా? శ్రీకృష్ణుడు మమ్ములను అనుగ్రహించేటట్లు నీవు చేయాలి. అతడు మాకు దర్శనాన్ని ఇవ్వాలి. నీవు అడ్డు పెట్టకు" అని అంటున్నది. ఈ విధంగా ఈ పాశురంలో శ్రీకృష్ణుడు, నీళాదేవి – అనే ఇద్దరిని గూర్చిన ప్రస్తావన ఉన్నది.

ఇక, మూడవది అయిన 20వ పాశురంలో, ఇద్దరినీ సమానంగా ప్రబోధిస్తున్నది, "తుయిలె*ழ*ాయ్!తుయిలె*ழ*ాయ్!" అని నిద్ర లేపుతున్నది. ఆ పాశురం ఈ విధంగా ఉన్నది.

ముప్పత్తు మూవర్, అమరర్క్కు మున్ శెన్ఱు ★
కప్పం తవిర్క్కుమ్ కలియే!, తుయిలె*ழ*ాయ్ ★
శెప్పమ్ ఉడైయాయ్!, తిఱల్ ఉడైయాయ్! ★ శె*ఱ్ఱ*ార్క్కు
వెప్పమ్ కొడుక్కుమ్, విమలా! తుయిలె*ழ*ాయ్ ★★
ఈ భాగంలో శ్రీకృష్ణుడు ప్రబోధింపబడుతున్నాడు.
శెప్పన్న మెన్ములై, చ్చెవ్వాయ్చ్చి శిఱు మరుంగుల్ ★
నప్పిన్నై నంగాయ్!, తిరువే! తుయిలె*ழ*ాయ్ ★

అని నీళాదేవి ప్రబోధింపబడుతున్నది. అందువల్ల ఇది భగవానుని వక్షస్సులో నెలకొని ఉండే లక్ష్మీదేవిని ఉద్దేశించినది – అని చెప్పవచ్చు.

ఈ విధంగా ఆలయాలలో మనకు మూడు దశలలో గోచరించే లక్ష్మీస్వరూపాన్ని ఈ మూడు పాశురాలు మనకు దర్శింప చేస్తున్నాయి. తిరుప్పావై ప్రబంధంలో నీళాదేవి ప్రస్తావన మూడుసార్లు మూడు పాశురాలలో చేయబడడంలోని తాత్వికమైన అర్థాలు వేరొక వైపు ఉండగా, ఇది కూడా ఒక సమన్వయంగా మనం భావించవచ్చు. ఈ విధంగా ఆలయాలలో మూడు దశలలో లక్ష్మీదేవి దర్శనం ఇవ్వడం ఎందుకోసం? ఒక లౌకికమైన ఉదాహరణతో గమనిద్దాం.

కొడుకు ఏదో తెలియక తప్పు చేశాడు. అతడు చేసిన తప్పును చూసి తండ్రి కోపగించుకుంటాడు. అతడు బయటకు కార్యం నిమిత్తం వెళ్లి, సాయంకాలం ఇంటికి రాబోతాడు. అతడు వచ్చినప్పుడు, అతని దగ్గరకు వెళ్లి "ఏదో తప్పు జరిగింది, నన్ను క్షమించు" అని తండ్రిని అడగడానికి కుమారునకు జంకు, భయం. అందువల్ల అతడు తండ్రి ఇంటికి తిరిగి రావడానికి ముందే తల్లి దగ్గరకు వెళ్లి " అమ్మా! నేను తెలియక తప్పు చేశాను. నీవే నా తండ్రి దగ్గర మంచి మాటలను చెప్పి, అతనిని సమాధాన పరచాలి, ఆయనకు కలిగిన కోపాన్ని క్షమింప చేయాలి " అని ప్రార్థిస్తాడు.

ఈ విధంగా మనం లక్ష్మీదేవి దగ్గర ప్రార్థించడం కోసమే లక్ష్మీదేవి ప్రత్యేకమైన ఆలయంలో దర్శనమిస్తున్నది.

తరువాత, తండ్రి ఇంటికి వస్తాడు. తల్లిదండ్రులు ఇద్దరు కూర్చుని మాట్లాడుకుంటూ ఉంటారు. అప్పుడు కుమారుడు వారి సమీపానికి వస్తాడు. తండ్రి ఇంకా కోపంగా ఉండడాన్ని గమనిస్తాడు. తల్లి వైపు చూస్తూ, సైగ చేస్తూ, " అమ్మా! నేను నిన్ను ఇంతకు ముందే ప్రార్థించానుకదా. నీవు తండ్రితో మాట్లాడి సర్ది

చెప్పు" అని ప్రార్థిస్తాడు. ఈ విధంగా ప్రార్థించడం కోసమే భగవదాలయంలో భగవంతుని మూర్తికి పక్కన లక్ష్మీదేవి వేంచేసి ఉండే సన్నివేశం ఉన్నది.

ఈ విధంగానే మనం భగవంతుని ఆలయానికి వెళ్ళినప్పుడు లక్ష్మీదేవి ప్రత్యేకంగా వేంచేసి ఉండే సన్నిధికి వెళ్లి, ఆమె సన్నిధిలో అలా తప్పులను విన్నవించి, భగవంతుడు మన్నించేటట్లు చేయమని అర్థించాలి భగవంతుని సన్నిధికి వెళ్ళినప్పుడు, ఆ స్వామి పక్కన ఉండే లక్ష్మీదేవిని సేవించి, "అమ్మా! ఇంతకుముందే నేను విజ్ఞాపన చేశానుకదా. నా తప్పులను స్వామి క్షమించేటట్లుగా పురుషకారాన్ని నీవే చేయాలి " అని ప్రార్థించాలి.

కుమారుడు ఈ విధంగా ప్రార్థించిన తరువాత, తల్లి, తండ్రిని ఏకాంతంలో కలిసి, కుమారుని సంగతిని చెప్పి, అతడు కుమారుని క్షమించేటట్లు చేస్తుంది. " ఇతడు మన కుమారుడు. ఇతనిపై కోపపడి ప్రయోజనం లేదు. ఇతడు తెలియక ఏదో తప్పు చేశాడు. అతని తప్పును మన్నించి, స్వీకరించండి " అని వేడుకుంటుంది. అప్పుడు ఆ దంపతులు ఇద్దరూ కొడుకు విషయంలో సమాధాన పడి, అతనిని క్షమిస్తారు. దగ్గరకు తీసుకుంటారు.

ఇదే రీతిలో, భగవంతుని వక్షస్సులో ఉండే లక్ష్మి కూడా ఆశ్రితుని దోషాలను ఏకాంతంలో భగవంతుని సన్నిధిలో తెలియజేసి, అతనిని స్వామి మన్నించేటట్లు చేస్తుంది.

ఈ విధంగా మూడు రూపాలలో ఉండే లక్ష్మీదేవి మనకు హితాన్ని కలుగజేస్తున్నది. ఈ తత్వాన్ని తెలుపడంకోసమే ఆలయాలలో మూడు విధాలయిన లక్ష్మీరూపాలు దర్శనమిస్తాయి. ఈ తత్వాన్ని తెలుపడంకోసమే గోదాదేవికూడా తిరుప్పావైలోని మూడు పాశురాలలో నీళాదేవి ప్రస్తావనను చేసింది.



# నీళాదేవినిగూర్చిన నిష్కర్ష

(కాంచీ మహావిద్వాన్ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారి ద్రావిడవ్యాసానికి అనువాదం)

ఆళ్వారుల దివ్యసూక్తులలో నీళాదేవినిగూర్చిన ప్రస్తావం మాటిమాటికి కనిపిస్తుంది. "నప్పిన్నై" అని కొన్ని చోట్ల, "పిన్నై" అని పలుచోట్ల నిర్దేశం ఉన్నది. "పిన్నైమణాళనై" (పిన్నైకు భర్త), "పిన్నైతోళ్ మణంద పేరాళా" (పిన్నై బాహువులను సంశ్లేషించిన మహానుభావా!), "నప్పిన్నై కాణిల్ శిరిక్కుమ్" (నప్పిన్నై చూస్తే నవ్వుతుంది), "నప్పిన్నై నంగాయ్ తిరువే!తుయిలెழாయ్!" (పూర్ణులారా! నప్పిన్నా! లక్ష్మీస్వరూపిణీ! నిద్ర లే) అని అంటూ "పిన్నై" అని "నప్పినై" అని తిరునామాన్ని నిర్దేశించి చెప్పడమే కాకుండా, ఈ విధంగా నామనిర్దేశం లేకుండానే, "కోవైవాయాళ్ పొరుట్టు ఏఱ్ఱిన్ ఇరుత్తమ్ ఇఱుత్తాయ్" (దొండపండువంటి పెదవిని కలిగిన నీళాదేవి కోసం ఏడు ఎద్దుల మూపురాలను మర్దించినవాడా!), "వంబవిழ் కోదైపొరుట్టా మాల్ విడై ఏழு మడర్ త్త" (సువాసనను కలిగిన కేశాలను కల కన్యకోసం గొప్ప వృషభాలను ఏడింటిని మర్ధించినవాడు), "అన్రురువేழమ్ తడవి నీ కొండ ఆయ్ మకళ్ అన్బనే!" (ఆనాడు ఏడు ఎద్దులను అవలీలగా జయించి, నీవు పరిగ్రహించిన గొల్ల కన్యకు ప్రియమైనవాడా!) అని సాధారణంగాను పలికిన సందర్భాలు కూడా అనేకం.

యశోదాదేవికి తోబుట్టువైన కుంభుడనే గోపాలుడు రేపల్లెలో ఉండేవాడు. ఆమెకు కుమార్తెగా జన్మించినది– ఈ నీళాదేవి. జనకచక్రవర్తి తన కుమార్తె అయిన సీతాదేవికి కన్యాశుల్కంగా శివుని వింటిని ఎక్కు పెట్టడాన్ని నిర్ణయించినట్లుగా, కుంభుడు కూడా తన కుమార్తె అయిన నీళాదేవికి, ఏడు ఎద్దులను మర్దించి,

స్వాధీనం చేసుకోవడాన్ని కన్యాశుల్కంగా నిర్ణయించాడు. స్వాధీనం చేసుకోవడానికి ఎవరికీ సాధ్యం కాని ఏడు ఎద్దులను ముందు పెట్టి, " వీటి పొగరును అణచినవానికి నా కుమార్తెను నీళాదేవిని ఇచ్చి వివాహం జరిపిస్తా"ననే ఒక వ్యవస్థను అతడు ఏర్పాటు చేశాడు. ఆమె రూపలావణ్యాదులనుగూర్చి విన్న పలువురు ఆమెను వివాహం చేసుకోవాలని ఆశపడి, ఆ ఏడు ఎద్దులను స్వాధీనం చేసికోవడానికి ప్రయత్నం చేయగా, పిడుగువంటి వాటి రంకెలతోనే వారు అందరూ చాలా దూరానికి పారిపోయి, తిరిగి వెళ్లిపోయారని, శ్రీకృష్ణుడు ఒక్కడే వాటిని అవలీలగా స్వాధీనం చేసికొని, వాటి పొగరును అణచి, నీళాదేవిని వివాహం చేసికొన్నాడని ఒక వృత్తాంతం చెప్పబడుతున్నది.

శ్రీకృష్ణావతారంలో రుక్మిణీసత్యభామలనే ప్రధానమహిషులుగా గ్రంథాలలో నిర్దేశించడం మాత్రమే కాకుండా, అర్చారూపాలలోకూడా ఆ విధంగానే మనం దర్శిస్తున్నాము. ఆళ్వారుల దివ్యప్రబంధాలలో రుక్మిణీదేవికి సంబంధించిన ప్రస్తావం చాలా స్వల్పంగానే కనిపిస్తున్నది. నమ్మాళ్వారులు తిరువాయ్ మొ*ழி* ప్రబంధంలో "అన్ఱ్జమర్ వెన్ఱు ఉరుప్పిణి నంగై యణి నెడుంతోళ్ పుణర్ న్దాన్" (7–10–6) (ఆనాడు యుద్ధభూమిలో జయించి, రుక్మిణిదేవి అందమైన, దీర్ఘమైన బాహువులను సంశ్లేషించాడు) అని, పెరియాళ్వార్ తిరుమొళిలో పెరియాళ్వార్లు "ఉరుప్పిణి నంగై తన్నై తేరే*ற்றி*క్కొండు–––" (రుక్మిణీదేవిని రథంపై ఎక్కించుకుని) (3–9–3) అని, " ఉరుప్పిణినంగైతన్నై మీట్పాన్ తొడర్ న్దోడి చ్చెన్ఱ" (4–3–1) (రుక్మిణీ దేవిని తిరిగి తీసుకొని రావడంకోసం వెంబడించి వెళ్ళిన) అని, నాచ్చియార్ తిరుమొళిలో " కణ్ణాలమ్ కోడిత్తు క్కన్ని తన్నై క్కైప్పిడిప్పాన్ తిణ్ణార్ న్దిరుంద శిశుపాలన్ తేశ*ழி*న్దు, అణ్ణాందిరుక్కవే అంగు అవన్ కైప్పిడిత్త పెణ్ణాళన్"

(11–9) (పెండ్లి ముస్తాబు చేసికొని, రుక్మిణీ దేవిని వివాహం చేసుకోవడం కోసం నిశ్చయం చేసుకున్న శిశుపాలుడు తేజస్సును కోల్పోయి చూస్తూ ఉండగానే, అక్కడ ఆమె పాణిని పరిగ్రహించిన పెండ్లికొడుకు) అని ఈ విధంగా కొన్ని సందర్భాలలో వెదకి చూడవలసిన విధంగా ఉన్నది. నీళాదేవికి సంబంధించిన ప్రస్తావనకే అపరిమితమైన సుభిక్షం ఉన్నది. ఇరామానుశనూఱ్ఱన్దాది ప్రబంధంలో కూడా "నంగళ్ పంజ త్తిరువడి పిన్నైదన్ కాదలన్" (దూదివలె సుకుమారమైన శ్రీచరణాలను కలిగిన పిన్నైకు ప్రియుడు), అని అంటూ నీళాదేవిని పురస్కరించుకునే భగవంతుని విశేషించి పలకడాన్ని గమనించవచ్చు.

ఈమెకు సంస్కృతంలో ఏమి పేరు? అనే విషయాన్ని తెలియాలి కదా. కూరేశులు, భట్టర్, దేశికులు– అనే ముగ్గురి సూక్తులలో మాత్రమే ఈ నీళాదేవికు సంబంధించిన ప్రస్తావం కనబడుతున్నది. ఈ ముగ్గురూ కూడా ఈమెను "నీళా" అనే నిర్దేశించారు. దీనినిగూర్చి తరువాత వివరిస్తాను. ఈ విషయం అటు ఉండనివ్వండి.

శ్రీకృష్ణపరమాత్మచరిత్రలను మనం తెలుసుకోవడానికి పరమప్రమాణాలుగా ప్రకాశిస్తున్న శ్రీవిష్ణుపురాణం, శ్రీభాగవతం, మహాభారతం మొదలైన ఇతిహాస పురాణాలలో దేనిలోనూ ఈ నీళాదేవికి సంబంధించిన ఇతిహాసం ఏమీ కనిపించడం లేదు. కొంతమంది నాగ్నజితి అనే ఆమె చరిత్రను చూచి, "ఆమెయే ఆళ్వారులు వస్తావించిన నప్పిన్నై ప్పిరాట్టి" అని చెప్పారు అని భ్రమిస్తారు. ఈ విధంగా కొందరు రాశారు కూడా. ఆమె చరిత్రలో ఏడు ఎద్దుల పొగరు అణచడం అనేది ఉన్నదనే కారణం చేత ఈ విధంగా భ్రమిస్తారు. కానీ, ఆమె క్షత్రియకన్యగా నిర్దేశింపబడడాన్ని గమనించాలి. శ్రీకృష్ణుడు రేపల్లెలో నివసించిన

కాలంలో ఈమెను వివాహం చేసుకున్నట్లుగా కథ ఉండి ఉండాలి. ఈమె గొల్లకన్యకగా కూడా ఉండాలి. ఈ రెండు అంశాలు అసంభావితాలు అయినందున, ఈమెను నీళాదేవిగా గ్రహించడంలో కొంచెం కూడా ఔచిత్యం లేదు. నీళాదేవిని గొల్లకన్య అనే స్పష్టంగా ఆళ్వారులు నిర్దేశించారు. "ఆయర్ మడమకళ్ పిన్నైక్కాగి అడల్విడై ఏழினైయుమ్ వీయ ప్పొరుదు వియర్ న్ద నిన్నానై" (4–1–4) (గొల్లకన్య అయిన పిన్నైకోసం పొగరు పట్టిన ఏడు ఎద్దులు నశించే చెట్లుగా పోరాడి, స్వేదాన్ని కలిగినవానిని) అని పెరియాళ్వార్లు, " అన్జురు వేழమ్ తడవి నీ కొండ ఆయ్ మగళన్బనే!" (7–2–9) (ఆనాడు ఉరుమువలె గర్జించే ఏడు ఎద్దులను భంజించి, నీవు వివాహం చేసుకొన్న గొల్లకన్యకు ప్రియుడా!) అని నమ్మాళ్వారులు అన్నారు. ఈ విధంగా ఇంకా చాలా పాశురాలు ఉన్నాయి అందుచేత నాగ్నజితిని నీళాదేవిగా మనసుతో భావించటానికి కూడా ఎంత మాత్రం అవకాశం లేదు.

అయితే, ఈమె చరిత్రను ఆళ్వారులు, గోదాదేవి ఏ విధంగా తెలిసికొన్నారు? అనే ప్రశ్న కలుగుతుంది. వేదాంతాచార్యులవారు యాదవాభ్యుదయం అనే కావ్యంలో రేపల్లెలో సంభవించిన సంఘటనలను ప్రస్తావించేటప్పుడు, నాలుగవ సర్గలో 98, 99 అనే రెండు శ్లోకాలతో శ్రీకృష్ణుడు నీళాదేవిని వివాహం చేసుకున్న వృత్తాంతాన్ని వర్ణించారు. ఆ రెండు శ్లోకాలు ఈ విధంగా ఉన్నాయి.

దిశా గజానామివ శాకరాణాం శృంగారనిర్భిన్నశిలోచ్చయానామ్,<br>
స తాదృశా బాహుబలేన కంఠాన్ నిపీడ్య లేభే పణితేన నీళామ్.<br>
కరేణ దంభోళి కఠోరతుంగాన్ దేహాన్ పృథూన్ దానవదుర్వృషాణామ్,<br>
విమృద్య నూనం విదధే ముకుందః ప్రియాస్తనస్పర్శవిహారయోగ్యామ్.

ఈ రెండు శ్లోకాలలో, మొదటి శ్లోకం ద్వారా– నీళాదేవిని వివాహం చేసుకోవడంకోసం ఏడు ఎద్దుల పొగరు అణచడం శుల్కంగా నిర్ణయింపబడింది– అని, ఆ విధంగానే, ఆ ఎద్దుల పొగరును అణచి ఆమెను శ్రీకృష్ణుడు వివాహం చేసుకొన్నాడని, నీళాదేవి అనేది ఆమె పేరు అని తెలుస్తున్నది. రెండవ శ్లోకం ద్వారా– ఈ ఎద్దులను తడవడం అనేది నీళాదేవి స్తనమండలాన్ని సంశ్లేషించినట్లుగా ఉన్నది– అని చెప్పడం ద్వారా ఈ అరుదైన గొప్ప కార్యం చాలా అవలీలగా సంభవించింది –అని చెప్పబడింది. ఇక్కడ వ్యాఖ్యానంలో అప్పయ్య దీక్షితులు ఈ కథను కొంచెం వివరంగా వ్రాసి, అది హరివంశంలో ఉన్నట్లుగా కూడా తెలియజేశారు.

"ఏవం హరివంశే కథా. విదేహనగరే యశోదానుజః కుంభకో నామ గవాంపతి రాసీత్. తస్య వ్రజే కాలనేమేః అసురస్య సుతాః సప్త ప్రాక్ భగవతా నిర్జితాః పూర్వవైర మనుస్మృత్య, కృష్ణాపచికీర్షయా వృషభరూపేణ న్యవసన్. తై శ్చ గోకులవిత్రాసన సస్యభక్షణాద్యైః ఉపద్రవేషు క్రియమాణేషు, స్వయం దమయితుమ్ అశక్తేషు చ తేషు, "య ఏషాం దమయితా, తస్మై స్వకన్యాం నీళాం దాస్యామీ"తి కుంభకః ప్రతిజజ్ఞే. తత్ర చ కదాచిత్ కృష్ణః సమాగత్య తాన్ మారయిత్వా నీళాం జగ్రాహేతి.

(హరివంశ పురాణంలో ఈ విధంగా కథ ఉన్నది. విదేహనగరంలో యశోదాదేవికి తమ్ముడు కుంభకుడు అనే గోకుల నాయకుడు ఉండేవాడు. కాలనేమి పుత్రులు ఏడుమంది పూర్వం భగవంతునిచేత ఓడింపబడినవారై, పూర్వవైరాన్ని స్మరిస్తూ, ఏ విధంగా అయినా శ్రీకృష్ణునకు అపకారాన్ని చేయాలని భావించి, ఏడు ఎద్దుల రూపంలో ఆ కుంభకుని గోకులంలో ప్రవేశించి, అక్కడ పంటలను తిని పాడుచేయడం, గోకులంలో ఉండేవారిని భయపెట్టడం మొదలైన ఉపద్రవాలను కలిగిస్తూ ఉన్నారు. వారిని వశం చేసుకోవడానికి సాధ్యం కానందువల్ల,

కుంభకుడు "ఎవడు ఈ ఏడు ఎద్దులను స్వాధీనం చేసుకుని, వీటి పొగరును అణుస్తాడో, అతనికి నా కుమార్తెను నీళాదేవిని ఇచ్చి వివాహం చేస్తాను" అనే మాట ఇచ్చాడు. ఒకానొక సమయంలో శ్రీకృష్ణుడు అక్కడకు వచ్చి, ఆ ఏడు ఎద్దులను మర్దించి, నీళాదేవిని వివాహం చేసికొన్నాడు.)

అయితే, ఎంత వెదకినప్పటికీ, హరివంశంలో ఈ కథ కనపడలేదు. అధికమైన ప్రచారంలో ఉండే శ్రీరామాయణాదులలో ఎన్నో మార్పులు చోటు చేసుకోవడం మనం గమనిస్తున్నాము. హరివంశంలోకూడా ఈ విధంగా చాలా మార్పులు జరిగి ఉండవచ్చు– అని ఇప్పుడు మనం భావించవలసి ఉన్నది. దీక్షితులు హరివంశంలో తాము చూడకుండా ఈ విధంగా వ్రాసి ఉండరు. ఈ విషయం ఏ విధంగానైనా ఉండనివ్వండి. మూలంలో శ్రీదేశికులు ఈ కథను వ్యక్తంగానే అనుగ్రహించడాన్ని మనం గమనిస్తున్నాము. ఇతిహాస పురాణాలలో ఏదైనా ఒక విషయాన్ని ఆధారంగా గ్రహించకుండా స్వతంత్రంగా వారు వ్రాసి ఉండరు. ధేనుకాసురవధం, కాళియమర్దనం మొదలైన చరిత్రలకు ముందే ఇది సంభవించినట్లు, రేపల్లెలో ఇది జరిగినట్లు దేశికులు తెలియజేయడాన్ని చూసినప్పుడు, ఇది పురాణప్రసిద్ధమైన కథే– అని మనం గ్రహించడంలో ఏ లోటు లేదు.

ఈ దివ్యదేవేరి తిరునామం "నీళా" అనే విషయం పైన ప్రస్తావించిన యాదవభ్యుదయసూక్తి వల్ల తెలుస్తున్నట్లే, పరాశర భట్టర్ శ్రీ సూక్తివల్ల ఆ విధంగానే, కూరేశుల శ్రీసూక్తివల్ల చక్కగా తెలుస్తున్నది. తిరుప్పావై ప్రబంధానికి భట్టర్ అనుగ్రహించిన తనియన్ శ్లోకం "నీలాతుంగస్తనగిరితటీసుప్తమ్" ఇత్యాదిగా ఉన్నది. ఈ శ్లోకంలోని మొదటి భాగం తిరుప్పావై ప్రబంధంలోని "కుత్తు విళక్కెరియ" అనే పాశురంలోని "నప్పిన్నై కొంగై మేల్వైత్తు క్కిడంద" అనే సూక్తికి అనువాదంగా ఉన్నది. ఈ సూక్తిలో ఉండే "నప్పిన్నై" అనే శబ్దమే "నీళా" అని నిర్దేశింపబడింది అనే విషయం స్పష్టమవుతున్నది. ఆ విధంగానే, కూరేశులు సుందరబాహుస్తవంలో

శ్రీకృష్ణావతారస్తుతి పరంగా అనుగ్రహించిన శ్లోకాలలో మొదటి శ్లోకం అయిన "హే సుందరైకతరజన్మని కృష్ణభావే" అనే శ్లోకంలో "నీళా కులేన సదృశీ తవ రుక్మిణీ చ" అని నాల్గవ పాదం ఉన్నది. ఇక్కడ ఉండే "నీళా" అనే శబ్దం నప్పిన్నైను నిర్దేశిస్తున్నది అనే విషయం సుస్పష్టం. భక్తిసార మునీంద్రులు తిరుచ్చంద విరుత్త ప్రబంధంలో అనుగ్రహించిన "ఆయనాగి ఆయర్మంగై వేయతోళ్ విరుంబినాయ్" (41) అనే సూక్తిని అనుసరించియే పైన నిర్దేశించిన సుందరబాహుస్తవశ్లోకం అవతరించినందువల్ల, గొల్లకన్య అయిన నప్పిన్నై పిరాట్టిని కూరేశులు " నీళా" అని నిర్దేశించారు– అనే విషయం నిస్సందేహం.

ఆళ్వార్లు ఏ సందర్భంలోనూ నప్పిన్నైను "నీళా" అనే పదంతో నిర్దేశించలేదు. అటువంటప్పుడు ఈ ఆచార్యులు ఇలా అని నిర్దేశించడానికి ఏమి కారణం? అని ఇక్కడ విచారించవలసి ఉన్నది యాదవాభ్యుదయ వ్యాఖ్యానకర్త అయిన అప్పయ్య దీక్షితులు ఈ నప్పిన్నై వృత్తాంతాన్ని సంస్కృత పురాణంలో చూచినట్లుగా ఇంతకు ముందే తెలియజేయబడింది కదా. ఆ పురాణంలో "నీళా" అనే పేరు ఉండి ఉండాలి. ఇది నేను ఊహాగానంగా చెప్పిన మాట. నా అంతరంగమైన అభిప్రాయాన్ని వినండి.

భగవంతుడు పరమపదంలో శ్రీదేవి, భూదేవి, నీళాదేవి– అనే ముగ్గురు దివ్యదేవేరులతో కూడి ఉంటాడని భగవ. చ్ఛాస్త్రాల వల్ల తెలుస్తున్నది. శ్రీరామాయణంలో సముద్ర శరణాగతి ప్రకరణంలో ఉన్న "భుజైః పరమనారీణామ్ అభిమృష్ట మనేకధా"" అనే శ్లోకానికి కల గోవిందరాజీయ వ్యాఖ్యానంలో కూడా దీనిని ఈ విషయాన్ని గమనించవచ్చు. కూరేశులు కూడా శ్రీవైకుంఠస్తవంలోని 78వ శ్లోకంనుండి ఆరంభించి, వరుసగా ఐదు శ్లోకాలతో ఈ ముగ్గురు దివ్యమహిషులను కీర్తించారు. దివ్యసూరులు కూడా, ఆ దివ్యమహిషులను ముగ్గురిని చేర్చి పలికే సందర్భాలలో, " ఉడనమర్ కాదల్ మగళిర్ తిరుమకళ్ మణ్ మగళ్ ఆయర్ మడమగళ్ ఎన్ఱివర్ మూవర్" (తనతో ఎల్లప్పుడూ కలసి ఉండాలని కోరే దేవేరులు అయిన లక్ష్మీదేవి, భూదేవి, గొల్ల కన్య అయిన నీళాదేవి అనే ఈ ముగ్గురు) అని, "కూందల్ మలర్ మంగైక్కుమ్ మణ్ మడందైక్కుమ్ కులవాయర్ కొళ్ముందుక్కుమ్

కేళ్వన్" (అందమైన కేశాలను కలిగిన లక్ష్మీదేవికి, భూదేవికి, గొల్లకులానికి చిగురువంటి నీళాదేవికి వల్లభుడు) అని, " కుழాజ్కోవలర్ మడప్పావైయుమ్ మణ్ మగళుమ్ తిరువుమ్ " (పిల్లనగ్రోవిని నిరూపకంగా కలిగిన గొల్లకులంలో జన్మించిన అందమైన కన్య నీళాదేవి, భూదేవి అనే ఈ ఇద్దరు లక్ష్మీదేవికి నీడవంటివారు) అని ఈ విధంగానే పల్కడాన్ని గమనిస్తున్నాము. భగవచ్ఛాస్త్రాలలో ప్రసిద్ధమైన నీళాదేవిని అళ్వార్లు "ఆయర్ మడమగళ్" అని, " కులవాయర్ కొழுన్దు" అని, "కుழాజ్కోవలర్ మడప్పావై" చెప్పినందున, ఆళ్వార్ల మనసులో గొల్లకన్యలలో ఒక్కతె అయిన నప్పిన్నై ప్పిరాట్టియే నీళాదేవి స్థానంలో గ్రహింపబడింది- అని నిస్సందేహంగా తేలుతున్నది. లేకపోతే, పరమపదంలో ఉండే దివ్యపత్నులను పరిగణన చేసి పలికేటప్పుడు "ఆయర్ మడమగళ్" అనే పదాన్ని ప్రయోగించడం ఎంత మాత్రం పొసగదు కదా.

అందుచేత, ఆళ్వారుల మన అభిప్రాయంలో నప్పిన్నై ప్పిరాట్టి నీళాదేవిగా గ్రహింపబడింది- అనేది స్పష్టపడుతున్నందున, దీనిని అనుసరించి మన పూర్వాచార్యులు ఆమెను సంస్కృత భాషలో నిర్దేశించవలసివచ్చినప్పుడు "నీళా" అని నిర్దేశించారు- అని నిశ్చయం చేసుకోవచ్చు.

ద్రావిడసాహిత్యకారులలో ఒకరైన నక్కీరుడు చాలా ప్రసిద్ధిని పొందినవాడు. ఆయనకు సహజమైన పేరు" కీరన్" అనేదే అని, ఔన్నత్యాన్ని సూచించే ఉపసర్గ అయిన, "న" అనే అక్షరాన్ని చేర్చి ఉపచారంగా "నక్కీరన్" అని వ్యవహరింపబడుతున్నారని పెద్దలు అంటారు. "పిన్నై, నప్పిన్నై" అనే సందర్భాలలో కూడా అదే విధంగా అన్వయించుకోవాలి. శ్రీదేవికి, భూదేవికి తరువాత పరిగణింపబడుతున్నది అనే కారణంవల్ల ఈమె "పిన్నై" అని ఆళ్వార్లచేత వ్యవహరింపబడింది.

★★★★★

# భగవద్గీత – తిరుప్పావై

సామ్య వైలక్షణ్యాలు

1) భగవద్గీత లోకానికి తండ్రి అయిన శ్రీకృష్ణునిచేత ఉపదేశింపబడింది. తిరుప్పావై ప్రబంధం లోకానికి తల్లి అయిన గోదాదేవి చేత ఉపదేశింపబడింది.

2) భగవద్గీత దేవతలకు కూడా దేవుడైన భగవంతునిచే ఉపదేశం చేయబడింది. తిరుపావై ప్రబంధం శ్రీకృష్ణునకు ఉపదేశింపబడినది. జీవుల పారతంత్ర్యాన్ని గూర్చి ఉపదేశించినందున అతనికి ఆచార్య స్థానీయురాలైన గోదాదేవిచేత ఉపదేశింపబడింది.

3) భగవద్గీత అర్జునుని వ్యాజంగా చేసికొని లోకానికి ఉపదేశింపబడింది. తిరుప్పావై ప్రబంధం శ్రీకృష్ణుని వ్యాజంగా చేసికొని లోకానికి ఉపదేశింపబడింది.

4) భగవద్గీత తన క్షత్రియ ధర్మాన్ని విడచి పెట్టిన అర్జునుని ఉద్దేశించి ఉపదేశింపబడింది. జగద్రక్షణను ధర్మంగా కలిగినవాడైనా దానిని విస్మరించిన భగవంతుని ఉద్దేశించి తిరుప్పావై ప్రబంధం ఉపదేశింపబడింది

5) భగవద్గీత సర్వజ్ఞుడైన భగవంతునిచే ఉపదేశింపబడినప్పటికీ, దానిని అర్జునుడు మరచిపోయాడు. తిరుప్పావై ప్రబంధం గోదాదేవిచే ఉపదేశింపబడినది. దానిని ఎవరూ మరచిపోలేదు. అందరూ దానిని అనుసరిస్తున్నారు.

6) భగవద్గీతను ఉపదేశించినందును చాలామంది ప్రాణాలు కోల్పోయారు తిరుప్పావై ప్రబంధాన్ని ఉపదేశించడం మూలంగా లోకంలో అందరూ ఉజ్జీవించే అవకాశం ఏర్పడింది

7) భగవద్గీత భారతంలో చెప్పబడినప్పటికీ, ఉపనిషత్తుగానే భావింపబడుతున్నది. ఇది చాలా పెద్ద ఉపనిషత్తు. 700 శ్లోకాలను కలిగిన ఉపనిషత్తు. తిరుప్పావై ప్రబంధం దివ్యప్రబంధంలో చేరినది. అందుచేత ఇది ఉపనిషత్తుగానే భావింపబడుతున్నది. ద్రావిడ ఉపనిషత్తుగా భావింపబడినప్పటికీ, ఉపనిషత్తులకు విత్తనం అయినందున చాలా చిన్న ఉపనిషత్తు, ఇది.

8) అర్జునుడు అనే పురుషుడైన స్నేహితుని ఉద్దేశించి శ్రీకృష్ణుడు దీనిని ఉపదేశించాడు. తమ స్నేహితురాండ్రను ఉద్దేశించి గోదాదేవి తిరుప్పావై ప్రబంధాన్ని ఉపదేశించింది. తిరుమంగై ఆళ్వారులు అనుగ్రహించిన పెరియతిరుమొ*ళ్ళి* ప్రబంధంలోని "మానమరుమ్ మెన్నోక్కి" అనే దశకంలో చెలికత్తెను ఉద్దేశించి పరకాల నాయిక చెప్పినట్లుగానే, ఇక్కడ కూడా గోదాదేవి తన చెలికత్తెలను ఉద్దేశించి పలికింది.

9) భగవద్గీతలో శ్రీకృష్ణుడు చివరిగా చరమోపాయమైన ప్రపత్తిని ఉపదేశించాడు. తిరుప్పావై ప్రబంధంలో గోదాదేవి ఆ ఉపాయాన్ని మొట్టమొదటి పాశురంలోనే ఉపదేశించినది. ఆమె ఉపదేశించిన మార్గశీర్ష వ్రతం అంటే, అది, మార్గాలలో శీర్షంవంటిది, అంటే, మార్గాలలో ఉత్తమమైనది. అదే ప్రపత్తి. ఈ ప్రపత్తి భగవద్విషయంలోని ప్రపత్తిని మాత్రమే కాకుండా, చరమోపాయంలో చరమోపాయంగా చెప్పదగిన, ఆచార్య విదయమైన అభిమానమే, అంటే, °ఆచార్యాభిమానమే ఉత్తారకం°– అనే సర్వోత్తమమైన ఉపాయాన్ని ఈ తిరుప్పావై ప్రబంధం తెలియజేస్తున్నది –అని పెద్దల అభిప్రాయం.

10) భగవద్గీతను లోకానికి ఉపదేశించిన శ్రీకృష్ణుడు జగదాచార్యుడు అయినాడు. జగదాచార్యుడైన ఆ శ్రీకృష్ణునకు తమ పారతంత్ర్యాన్ని ఉపదేశించి, అతనికి కూడా

గోదాదేవి ఆచార్య అయినది. చిన్న పిల్లలకు వేదాలను నేర్పించినట్లుగా, వేదాంతార్థాలను గోపికలకు ఉపదేశించి ఆచార్య అయినది.

11) సంసార సముద్రంలో మునిగి ఉండి, కష్టాలను అనుభవిస్తున్న లోకంలోనివారికి తత్వజ్ఞానం కలగడం కోసం శ్రీకృష్ణునిచే భగవద్గీత ఉపదేశింపబడింది. అందుచేత, భగవద్గీత శోకనివృత్తి కోసం ఏర్పడింది. ఆ విధంగానే, ఈ సంసారంలో పడి అనేక బాధలను అనుభవిస్తున్న జీవులను మంచి గతిని పొందేటట్లు చేయడం కోసం వరాహ స్వామి దగ్గర ఉపదేశాన్ని పొందిన భూదేవి గోదాదేవిగా అవతరించి, ఆ జ్ఞానాన్ని తిరుప్పావై ప్రబంధరూపంలో లోకంలో అందరికీ ఉపదేశించినది. అందుచేత ఇది కూడా శోకనివృత్తి కోసం ఏర్పడినదే.

12) భారతయుద్ధ సమయంలో అర్జునునకు మూడు విధాలైన శోకాలు ఏర్పడ్డాయి. అవి ఏమంట

1) బంధువులను వధించడం వల్ల పాపం కలుగుతుంది అనే శోకం,

2) దైవసంపద ఉన్నవానికి సద్గతి కలుగుతుంది. ఆసుర సంపద ఉన్నవారికి సద్గతి కలుగదు –అని చెప్పడం వల్ల, " నేను ఆసుర సంపదను కలిగి ఉండేవాడను అయితే ఏమి చేయాలి?" అనే శోకం,

3) కఠిమైన, ఆచరించడానికి చాలా కష్టమైన కర్మ, జ్ఞానం, భక్తియోగాలను ఉపదేశంగా పొందినందున, తనకు వాటిని చేయడం సాధ్యం కాదే!– అనే శ్లోకం.

ఈ మూడిటిని శ్రీకృష్ణుడు గీతోపదేశం ద్వారా తీర్చాడు.

ఇక్కడ కూడా మూడు విధాలయిన శోకాలు ఏర్పడ్డాయి.

1) రేపల్లెలో దుర్భిక్షం ఏర్పడినందున ఇది తీరడం కోసం గోపికలు నోము చేసారు. అందుచేత దుర్భిక్షంవల్ల ఏర్పడిన శోకం వ్రతంద్వారా తీరింది. ఇది మొదటి శోకం.

2) రేపల్లెలోని గోపికలు నందకుమారుడైన శ్రీకృష్ణుని భర్తగా పొందాలని యమునానదీ తీరంలో అతనిని అర్చించారు. శ్రీకృష్ణుని భర్తగా పొందలేనందు వల్ల వారికి కలిగిన శోకం కూడా వారు వ్రతం చేసినందున తీరింది. ఇది రెండవ శోకం.

3) ఈ లోకంలోని జనులు ఈ లౌకికమైన విషయాలనే అనుభవిస్తూ ఆనందించే రీతిలోనే సంచరిస్తూ, ఈ తారపత్రయాలలోనే మునిగి బాధపడుతున్నారు. సద్గతిని పొందడానికి తగిన దారిని తెలియలేక వీరు ఉన్నందున, శోకసముద్రంలోని వీరు మునిగి ఉన్నారు. అశోకంకూడా ఈ వ్రతం వల్ల తీరిపోయింది.

నోము, శ్రీకృష్ణుని భర్తగా పొందడం, తత్వాలను తెలియజేయడం –అనే ఈ మూడు ఈ తిరుప్పావై ప్రబంధంలో ఉపదేశింపబడినందున, పైన ప్రస్తావించిన మూడు శోకాలు తీరిపోయాయి.

ఇంకా, ఇటువంటి, చక్కని సామ్యాలను “భగవద్గీత– తిరుప్పావై ప్రబంధం అనే ఈ రెండిటి మధ్య సంభావించవచ్చు.

★★★★★

# తిరుప్పావైలో దివ్యదేశప్రస్తుతి

భగవంతుడైన శ్రీమన్నారాయణుడు జగత్తులో అంతటా వ్యాపించి ఉండేవాడైనా, భక్తుల ఆరాధనా సౌకర్యం కోసం పరం, వ్యూహం, విభవం, అంతర్యామి, అర్చ అని ఐదు విధాలుగా ఉండే రూపాలను కలిగి ఉంటాడని పాంచరాత్రాదిశాస్త్రాలు చెబుతున్నాయి. పరం అనేది వైకుంఠంలోని రూపం. వ్యూహం అనేది పాలకడలిలోని రూపం, విభవం అనేది ఆయా అవతారాలలోని రూపం, అంతర్యామి అనేది ప్రతి జీవి హృదయంలో ఉండే రూపం, ఇక, అర్చ అనే ఐదవ రూపం దివ్యదేశాలలో, మందిరాలలో, గృహాలలో నెలకొని ఉండే రూపం. ఈ ఐదింటిలో అర్చ అనే రూపంలో భగవంతుని పరత్వం సౌలభ్యం అనే రెండు అసాధారణ లక్షణాలు పరిపూర్ణంగా ఉన్నందున, దీనిని ఉపనిషత్తులు పూర్ణశబ్దంతో కీర్తించాయి. దివ్యసూరులు అనబడే ఆళ్వారులు కూడా తమ దివ్యప్రబంధాలలో మాటిమాటికి ఈ ఐదు రూపాలను కీర్తించినప్పటికీ, అర్చారూపానికే ప్రాధాన్యాన్ని ఇచ్చారు. గోదాదేవి కూడా తాము అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలో మొదటి పాశురంలో పరరూపాన్ని, రెండవ పాశురంలో వ్యూహ రూపాన్ని, మూడవ పాశురంలో విభవ రూపాన్ని, నాల్గవ పాశురంలో అంతర్యామి రూపాన్ని, అయిదవ పాశురంలో అర్చారూపాన్ని ప్రస్తుతించినప్పటికీ, అర్చారూపాన్ని ఆ ప్రబంధంలోని 30 పాశురాలలోనూ ప్రస్తావించారు– అని అభిజ్ఞులైన పెద్దల అభిప్రాయం. పాశురాలలో ఆమె ప్రయోగించిన ఆ యా పదసందర్భాలనుబట్టి ఈ విధంగా చెప్పే అవకాశం ఉన్నదని కూడా వారు వివరించారు. ఈ అంశాన్ని సంగ్రహంగా గమనిద్దాం.

ద్రావిడ భాషలో “కోయిల్” అనే పదానికి అర్చామూర్తి వేంచేసి ఉండే దేవాలయం –అని అర్థం. ఇదే తెలుగులో కోవెల అయినది. గోదాదేవి ఈ పదప్రయోగాన్ని తిరుప్పావై ప్రబంధంలో పలు పాశురాలలో చేయడం

గమనించవచ్చు. ఆరవ పాశురంలో “ “పుళ్ళరైయిన్ కోయిలిల్” అని, 14వ పాశురంలో “తంగళ్ తిరుక్కోయిల్” అని, 16వ పాశురంలో “కోయిల్ కాప్పానే” అని, 23వ పాశురంలో “నిన్ కోయిల్ నిన్ను” అని, 26వ పాశురంలో “నిన్ కోయిల్ నిన్ను ఇంగనే పోందరుళి” అని ఈ విధంగా పలు పర్యాయాలు ఈ పదప్రయోగం చేయబడడం కనిపిస్తుంది. ఇవి అన్నీ భగవంతుని ఆలయాలు అనే అర్థంలోనే ప్రయోగింపబడ్డాయి. ఇవి, ఈ ప్రబంధంలోని, సాధారణంగా మనకు దేవాలయం ప్రశస్తిని సూచించే ప్రయోగాలు. ఇంతే కాకుండా, ప్రతిపాశురంలోనూ గోదాదేవి చేసిన పదప్రయోగాల సామర్థ్యం వల్ల కొన్ని దివ్యక్షేత్రాలు ప్రస్తావింపబడ్డాయి– అని చెప్పవచ్చు. ఈ విషయంగా నాలుగైదు ఉదాహరణలను మాత్రం గమనిద్దాం.

“ఓంగి ఉలగు అళంద “ అనే మూడవ పాశురంలో త్రివిక్రమావతార వైభవం ప్రస్తావింపబడింది. భగవంతుడు త్రివిక్రమరూపంలో చాలా క్షేత్రాలలో దర్శనం ఇస్తున్నప్పటికీ, వాటిలో తిరుక్కోవలూర్ అనే క్షేత్రాన్నే ప్రధానమైనదిగా పరిగణిస్తారు. అందుచేత ఈ పాశురంలో ఆ క్షేత్రప్రస్తావన ఉన్నదని భావించవచ్చు.

“ఆళి మళై క్కణ్ణా” అని ఆరంభం అవుతున్న నాలుగవ పాశురంలో “ పాళియమ్ తోళుడై పఱ్పనాబన్” (బలిష్టమైన, అందమైన పావులను గల పద్మనాభుడు అనే ప్రయోగం ఉన్నందున, అనంత పద్మనాభుడు ఇక్కడ ప్రస్తావింపబడ్డాడు అని చెప్పవచ్చు. అనంతపద్మనాభుని రూపంలో భగవంతుడు నెలకొని ఉండే క్షేత్రం కేరళ దేశంలోని తిరువనంతపురం అనే అనంతపద్మనాభక్షేత్రం కనుక, ఈ పాశురంలో ఈ క్షేత్రప్రస్తావన చేయబడిందని భావించే అవకాశం ఉన్నది.

21వ పాశురంలో “ నిన్ కోయిల్ నిన్ను ఇంగనే పోందరుళి” (నీ ఆలయం నుండి ఈ విధంగా వేంచేసి) అనే ప్రయోగం ఉన్నందున ఈ పాశురంలో శ్రీరంగక్షేత్ర ప్రస్తావన చేయబడింది అని చెప్పవచ్చు. ఈ పాశురంలోనే కాక, మిగతా కొన్ని

పాశురాలలో కోయిల్ అనే పదప్రయోగం చేయబడినప్పటికీ, ఈ పాశురంలో శ్రీకృష్ణుని గమనసౌందర్యం విశేషించి ప్రస్తావన చేయబడడం చేత, శ్రీరంగంలో శ్రీరంగనాథుని "నడైయళకు" అనబడే గమనసౌందర్యం ప్రసిద్ధం కనుక, ఇందులో శ్రీరంగ ప్రస్తావన చేయబడిందని భావించే అవకాశం ఉన్నది.

26వపాశురంలో " ఆలినిలైయాయ్" అని అంటూ వటపత్రశాయి ప్రస్తావన చేయబడింది. శ్రీవైష్ణవ దివ్యక్షేత్రాలలో వటపత్ర శాయి రూపంలో భగవంతుడు నెలకొని ఉండే క్షేత్రం శ్రీవిల్లి పుత్తూరు అనే క్షేత్రం. అందుచేత, ఈ పాశురంలో శ్రీవిల్లి పుత్తూర్ క్షేత్రప్రస్తావన ఉన్నదని భావించవచ్చు.

"కూడారై వెల్లుమ్" అనే 27 వ పాశురంలో తిరువేంగడం అనే శ్రీవేంకటాచలప్రశస్తి భావించదగినది. ఇందులో మొదటి పాదాన్ని చివరి పాదాన్ని ప్రధానంగా గ్రహించాలి. మొదటి పాదంలో నిరోధి నిరసనం, చివరి పాదంలో అందరూ కలిసి ఆనందించిన విధానం చెప్పబడ్డాయి. శ్రీరామానుజులు శ్రీవేంకటేశ్వరుని విషయంలో ఏర్పడిన వివాదాన్ని పరిష్కరించి, విరోధి నిరసనాన్ని చేసిన చరిత్ర ప్రసిద్ధం. ఇక, చివరి పాశురంలో ఉండే "కూడి ఇరుందు" అనే ప్రయోగం ఈ కొండపై నిత్యకైంకర్యాన్ని చేయాలని నమ్మాళ్వారులు ఆశపడిన విషయాన్ని సూచిస్తున్నది. ఆ విధంగానే, ఈ పాశురంలోని "కుళిర్ న్దు" అనే ప్రయోగం కూడా " "కుళిరరువి వేంగడమ్ " (చల్లని కొండవాగులను కల వేంకటాచలం) అని మొదలైన దివ్యసూరుల ప్రయోగాలను స్మరింప చేస్తుంది. అందుచేత, ఇందులో వేంకటాద్రి క్షేత్రప్రస్తావన చేయబడిందని భావించవచ్చు.

ఈ విధంగానే తిరుప్పావై ప్రబంధంలోని మిగిలిన పాశురాలలో కూడా పలు దివ్యదేశాల ప్రశస్తి మనకు గోచరిస్తుంది. స్వస్తి.

★★★★★

# “నిన్ కైయిల్ వేల్ పో*ఱ్ఱి*”

తిరుప్పావై ప్రబంధంలోని 24గవ పాశురం ఒక విలక్షణమైన పాశురం. దీనికి మంగళాశాసన పాశురం అని పేరు. ఇందులో ఆండాళ్ తల్లి భగవానునకు మంగళాశాసనం చేస్తున్నది. ఈ పాశురంలోని ఆరు పాదాలలో “పో*ఱ్ఱి*, పో*ఱ్ఱి*” అని అంటూ భగవంతునకు మంగళాశాసనం చేయడం కనిపిస్తుంది. ఈ ఆరు పాదాలలోని ఐదు పాదాలలో ఆయా యుగాలలోని భగవంతుని అద్భుత లీలలకు మంగళాశాసనం చేయడం, ఆరవ పాదంలో శ్రీకృష్ణ భగవానుని చేతిలో ఉండే వేలాయుధానికి మంగళం పాడడం గోచరిస్తుంది. ఈ విధంగా గోదాదేవి ఆరు మార్లు మంగళాశాసనం చేయడం షడ్రసోపేతమైన భోగ్యమైన అన్నాన్ని భుజించడం – అని, భగవంతుని జ్ఞానం మొదలైన ఆరు గుణాలకు మంగళం పాడడం – అని, ఈ విధంగా పలు విధాలుగా పెద్దలు ఈ మంగళా శాసనలను అందంగా వివరించారు. అయితే, గోదాదేవి మొదటి అయిదు పాదాలలో భగవంతుని వివిధాలైన అపదానాలకు మంగళాశాసనం చేసి, చివరిగా 6వ పాదంలో శ్రీకృష్ణ భగవానుని చేతిలో ఉండే వేలాయుధానికి మంగళం పాడడంలో ఉండే స్వారస్యం ఏమి? కొంచెం గమనిద్దాం.

ఈ వేలాయుధం అనేది శ్రీకృష్ణుని చేతిలో ఉండే బల్లెంవంటి ఆయుధం. ఇది గొల్ల జాతికి ఉచితమైన ఆయుధం నందగోపాలునిగూర్చి మొదటి పాశురంలో పలికేటప్పుడు గోదాదేవి “కూర్వేల్ కొ*ౘ్ఱుమ్* తొ*ழி*లన్ నందగోపన్ “ (పదునైన అగ్రభాగాన్ని కలిగిన వేళాయుధంతో క్రూరమైన వ్యాపారాలను చేసే నందగోపాలుడు) అని అంటూ నందగోపాలుడు కూడా ఇటువంటి వేలాయుధాన్ని

కలిగినవాడని తెలిపింది. అందువల్ల, ఈ ఆయుధం గోపాలకులానికి చెందిన ఆయుధం అని తెలుస్తున్నది. శ్రీకృష్ణుడు కూడా ఇటువంటి ఆయుధాన్ని చేతిలో ధరించి, గోవులను కాచేవాడు.

ముందుగా 5 పాదాలలో భగవంతుని వీరచరిత్రలకు మంగళం పాడిన గోదాదేవి, అటువంటి వీరచరిత్రలను శ్రీకృష్ణుడు చేశాడు అని అందరికీ తెలిస్తే, ఆ స్వామికి దృష్టిదోషం తగులుతుందో! ఏమో! అనే భయశంకతో "ఈ వీర చరిత్రలు అన్నీ నీకు చెందినవి కాదు. ఈ అద్భుత కృత్యాలన్నీ నీ చేతిలోని వేలాయుధం నిర్వహించినవేసుమా! ఆ వేలాయుధానికి మేము మంగళం పాడుతున్నాము " – అని ఆరవ పాదంలో అంటున్నది.

భగవంతుని వీరకృత్యాలకు గుణాలకు మంగళం పాడడంలో అర్థం ఉన్నది. కానీ, ఆ స్వామి చేతిలో ఉండే అచేతనమైన వేలాయుధానికి గోదా దేవి మంగళం పాడడంలో ఏమి అర్థం? ఈ ఆయుధాన్ని చూస్తే, ఇది అచేతనంగా కనబడుతుంది కదా! అచేతనమైన ఒక వస్తువు విషయంలో అస్థానే భయశంక కలుగడం, దానికి తగినట్లు మంగళం పాడడం – అనే ఈ ప్రక్రియ ఏ విధంగా పొసగుతుంది? అనే సందేహం సహజంగా కలుగవచ్చు.

అయితే, ఇక్కడ ఒక విషయాన్ని గమనించాలి. భగవంతుడు ఈ భూమిలో అవతరించినప్పుడు, ఆ స్వామిని సేవించడంలో ఎల్లప్పుడూ ఆసక్తిని కలిగి ఉండే నిత్యులు, ముక్తులు కూడా ఈ లోకంలో భగవంతునకు తాము చేసే సేవలకు తగిన రూపాలను పరిగ్రహించి, ఈ లోకానికి వస్తారు – అని శాస్త్రాలు, ఇతిహాసాలు, పురాణాలు, ఆళ్వారుల దివ్యసూక్తులు, పూర్వాచార్యుల సూక్తులు చెబుతున్నాయి. పాంచరాత్రంలోని పౌష్కరసంహిత

## నిన్ కైయిల్ వేల్ పోற்றி

"స్రగ్వస్త్రాభరణైర్యుక్తం స్వానురూపై రనూపమైః,
చిన్మయైః స్వప్రకాశై శ్చాన్యోన్య రుచి రంజకైః"

(తనకు తగినవి, సాటి లేనివి, చైతన్యాన్ని కలిగినవి, తమ ప్రకాశాంతో పరస్పరం శోభను కలిగించుకునేవి అయిన హారాలు, వస్త్రాలు, ఆభరణాలు అనే వీటితో కూడినవానిని) అని భగవంతుని అర్చామూర్తినిగూర్చి పలికిన సూక్తి విభవ రూపంలో కూడా ఒప్పుతుంది. అందుచేత, ఇక్కడ గోదాదేవి వేలాయుధానికి మంగళం పాడడం అంటే, ఆ రూపంలో శ్రీకృష్ణ భగవానునకు సేవ చేసే పరమ భాగవతుడైన ఒక నిత్యునకు కానీ, ముక్తునకు కానీ మంగళం పాడడమే కదా. అందువల్ల ఈ వేలాయుధినికి చేసిన మంగళాశాసనం భాగవత మంగళాశాసనంలోకి పర్యవసిస్తుంది అని గ్రహించాలి భగవద్భక్తి భాగవతభక్తిపర్యంతంగా అనువర్తించినప్పుడు కదా అది పూర్తి అయినట్లు చెప్పదగినదై ఉంటుంది.

ఈ విధంగా గోదాదేవి భగవంతుని శ్రీచరణాలకు మంగళం పాడిన వెంటనే, ఆ స్వామిని సదా రక్షిస్తూ, మంగళాన్ని పాడే దివ్యాయుధాల రూపంలోని పరమభాగవతులకు మంగళాశాసనం చేయడం అనేది ఆమెకు పైతృకధనంగా లభించింది. ఆమె తండ్రిగారైన పెరియాళ్వార్లు తిరుప్పల్లాండు ప్రబంధం ఆరంభంలో "పల్లాండు పల్లాండు" అని భగవంతునకు మంగళం పాడి, వెనువెంటనే "వడివార్ శోది వలత్తుఱైయుమ్ శుడరాழியుమ్ పల్లాండు" (జ్యోతి స్వరూపుడైన, నీ కుడి భుజంలో అధివసించి ఉండే, ప్రకాశించే శ్రీసుదర్శనానికి మంగళం) అని భగవంతునకు ఎల్లప్పుడూ రక్షణను నిర్వహిస్తూ ఉండే, మంగళాశాసనపరుడైన సుదర్శన భగవానునకు మంగళం పాడారు.

ఇప్పుడు, ఈ వేలాయుధం రూపంలో ఉండే నిత్యసూరి ఎవరై ఉంటారు? అని భావన చేసినప్పుడు. ఆ మహనీయుడు శ్రీసుదర్శన భగవానుడు అని

అభ్యూహించే అవకాశం ఉన్నది. భగవంతుడు ఏ అవతారం ఎత్తినప్పటికీ, ఆ అవతారంలో ఆ స్వామి చేసే శత్రుసంహారాలకు అనుగుణంగా ఉండే ఆయుధరూపంలో శ్రీసుదర్శన భగవానుడు రూపొందుతాడు. శ్రీసుదర్శన శతకంలో ఈ విషయాన్ని శ్రీకూరనారాయణ మునులు తెలుపుతూ "వాణీ పౌరాణికీయం ప్రథయతి మహితం ప్రేక్షణం కైటభారేః శక్తిః యస్యేషుదంష్ట్రనఖపరశుముఖవ్యాపినీ తద్విభూత్యామ్" (77) (భగవంతుని సంకల్పరూపుడైన శ్రీసుదర్శనభగవానుడు భగవంతుని వరాహావతారసమయంలో కోఱగాను, నరసింహావతార సమయంలో గోళ్ళుగాను, పరశురామావతార సమయల్లో గొడ్డలిగాను, ఇంకా ఇటువంటి భగవదవతారాలలో ఆ అవతారాలకు అనుగుణమైన ఆయుధంగాను రూపొందుతాడు అని పురాణాలు పలుకుతున్నాయి) అని అన్నారు అందువల్ల శ్రీ కృష్ణావతార సమయములో కూడా శ్రీ సుదర్శన భగవానుడు ఉండి, శ్రీకృష్ణ భగవానునకు రక్షించడం అనే కైంకర్యాన్ని నిర్వహించాడు అని తెలియాలి. ఈ సుదర్శన భగవానునకే గోదాదేవి ఆరవ పాదంలో మంగళాశాసన కైంకర్యం చేసింది.

★★★★★

# తిరుప్పావై చిన్నపిల్లలకోసమే

గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధానికి చాలా విధాలైన ప్రత్యేకతలు ఉన్నాయి. వాటిలో, ఈ కాలానికి సంబంధించిన ఒక ప్రత్యేకత ఏమంటే, ప్రత్యేకించి చిన్నపిల్లల కోసంగా ఈ ప్రబంధం అవతరించినది – అనేది.

తిరుప్పావైలోని చాలా పాశురాలలో గోదాదేవి ఈ విషయాన్ని తెలియజేసింది. ఈ ప్రబంధాన్ని అనుగ్రహించే సమయానికి ఆమె వయస్సు 5 సంవత్సరాలు మాత్రమే అని మన పూర్వాచార్యుల అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని శ్రీపిళ్లై లోకమ్ జీయర్ అనే పూర్వాచార్యులు ఉపదేశరత్తినమాలై అనే ప్రబంధానికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహిస్తూ తెలిపారు. తనవలె చిన్న వయస్సులో ఉండే తన చెలికత్తెలను తిరుప్పావై వ్రతాన్ని చేయడంకోసం ఆహ్వానించింది – అనేది ఇంకొక ప్రత్యేకత.

సామాన్యంగా లోకంలో మనం గమనించినప్పుడు, పెద్ద వయస్సులో ఉండేవారు చిన్న వయస్సులో ఉండేవారిని ఈ విధంగా ఆహ్వానించడాన్ని చూస్తాము. “ఎక్కడకు పోకండి, అక్కరలేని కార్యాలలో కాలాన్ని వ్యర్థం చేయకండి, భగవద్విషయంలో విశ్వాసాన్ని భక్తిని కలిగి ఉండండి” అని పెద్దలు చిన్నపిల్లలను పిలుస్తారు. ఈ విధంగా పెద్దలు చిన్న పిల్లలను పిలిచినప్పుడు ఏర్పడే ఆకర్షణ, ప్రభావం కంటే, చిన్న వయస్సులో ఉండేవారే చిన్న వయస్సు పిల్లలను పిలిస్తే, అప్పుడు ఆ పిలుపులోని ప్రభావం, ఆకర్షణ ఎక్కువగా ఉంటాయి. వేరుగా ఉంటాయి. అటువంటి సన్నివేశాన్నే మనం తిరుప్పావై ప్రబంధంలో చూస్తాము. చిన్నపిల్లలు పెద్ద వయస్సులో ఉండేవారితో కలిసి ఒక కార్యాన్ని నిర్వహించినప్పుడు ఉండే శ్రద్ధ, ఆకర్షణ కంటే, చిన్నపిల్లలే చిన్నపిల్లలతో కలసి ఒక కార్యాన్ని

నిర్వహించినప్పుడు ఉండే శ్రద్ధ, ఆకర్షణ ఎక్కువగా ఉంటాయి. అందువల్లనే ఈ తిరుప్పావై ప్రబంధానికి ఇంతటి ప్రత్యేకత ఉన్నది.

గోదాదేవి మొదటి పాశురం ఆరంభంలోనే " శెల్వ చ్చిఱుమీర్ కాళ్!" అని చిన్న వయస్సులో ఉండే బాలికలను మార్గశీర్ష వ్రతాన్ని ఆచరించడం కోసం ఆహ్వానించింది. అదే విధంగా, 16వ పాశురంలోకూడా, "ఆయర్ శిఱుమియరోముక్కు" అని ఉన్నది.

ఈ విధంగా "చిన్నపిల్లలం!, చిన్నపిల్లలం!" అని తమను నిర్దేశించుకోవడం మాత్రమే కాదు, 11వ పాశురంలో "క*ఱ్ఱు* క్కఱవై క్కణంగళ్ పల కఱందు" అని లేగ దూడలతో కూడి ఉండే, లేత వయస్సులో ఉండే గోవులను ప్రస్తావించినది. మనం చిత్రాలలో చూసినప్పుడుకూడా ఆవు ఒంటరిగా ఉండే సన్నివేశంలో కంటే, తన దూడతో కలసి ఉండే సన్నివేశంలోనే ఎక్కువ అందంగా ఉంటుంది. ఆ విధంగానే భగవద్భక్తుల విషయాన్ని గమనించినప్పుడు, ఆ భగవద్భక్తి ఒకతరంతో మాత్రమే నిలిచిపోకుండా, అంతరించిపోకుండా నిరంతరంగా, తరువాత తరంలో కూడా కొనసాగితే, ఎంత బాగుంటుంది! అదే ఇక్కడ "క*ఱ్ఱు* క్కఱవై క్కణంగళ్" అని సూచింపబడింది. మళ్లీ, ఱ అదే విధంగా, 12వ పాశురంలో, "కనైత్తు ఇళంగత్తు ఎరుమై కన్ఱుక్కిరంగి" అని లేగ దూడలతో కూడి ఉండే ఎనుముల ప్రస్తావనను చేయడం జరిగింది. ఈ విధంగా భగవద్భక్తి అనేది ఏదో ఒకటి రెండు తరాలతో ఆగిపోకుండా, తరువాతి తరాలకు కూడా సంక్రమిస్తూ, నిరంతరంగా కొనసాగడమే కదా, శ్రీకృష్ణునకు అభిమతమైనది.

ఈ విధంగా ప్రస్తుతసమాజం ఉన్నదా? చిన్న వయస్సులో ఉండేవారికి ఎంతమందికి గోదాదేవినిగూర్చి, తిరుప్పావై ప్రబంధాన్నిగూర్చి తెలుసు? చాలా

కొద్దిమందికే తెలుసు అని చెప్పవలసి ఉంటుంది. ఏవో కొన్ని చోట్ల, కొన్ని విద్యాలయాలలో, ఈ వివరాలను, విశేషాలను చిన్నతరాలవారికి తెలియజేసే సన్నివేశాలు, ప్రయత్నాలు ఉంటే ఉండవచ్చు. అటువంటివి చాలా పరిమితంగా ఉంటాయి. ఆ విధంగా తెలిపేటప్పుడు, కూడా, తిరుప్పావై ప్రబంధంలో చెప్పబడిన విషయం ఏమి? అనే పర్యంతంగా తెలియజేసే ప్రణాళికలు కూడా ఇంకా పరిమితం అనే చెప్పాలి. కానీ, తిరుప్పావై ప్రబంధం ప్రత్యేకించి చిన్నపిల్లలకు సంబంధించినది అని, అందులో తమను గూర్చి చెప్పబడింది అని చిన్న వయస్సులో ఉండేవారికి తెలిస్తే, అప్పుడు దానిపై వారికి ఆసక్తి కలుగుతుంది, తప్పక పెరుగుతుంది – అని అనడంలో ఏ సందేహం లేదు. ఏ వస్తువైనా, అందరికీ సాధారణంగా ఉండేదానిని చిన్నపిల్లలకు ఇవ్వడం కంటే, చిన్నపిల్లలకోసంగా ఏర్పడిన వస్తువును వారికి ఇస్తే, అప్పుడు దానిమీద వారికి ఉండే ఆసక్తి తప్పక ఎక్కువగా ఉంటుంది.

ఉదాహరణకు, తినే వస్తువులనే తీసుకుందాం. "ఈ ఆహారం చక్కెర వ్యాధి కలవారికి ప్రత్యేకంగా సిద్ధం చేయబడింది, వారికోసమే దీనిని సిద్ధం చేసి ఇస్తున్నాము" అని అంటే, అప్పుడు ఆ వస్తువుపై చక్కెరవ్యాధి ఉండేవారికి ఏర్పడే ఆసక్తి, ఆదరం ఎక్కువగా ఉంటుంది. " ఈ ఆహారం గర్భిణీస్త్రీలకోసం ప్రత్యేకంగా సిద్ధం చేయబడింది" అని అన్నప్పుడు, దానిపై గర్భిణులకు ఉండే ఆసక్తి అధికంగా ఉంటుంది. ఈ విధంగా చెబుతూ ఇచ్చే ఆహారంలో ఎంత ప్రత్యేకత ఉంటుంది? అనేది వేరే విషయం. కానీ, ఒక వస్తువును"ఇది కొంతమంది నిర్దిష్టమైన వ్యక్తుల కోసంగానే సిద్ధం చేయబడింది"– అని అన్నప్పుడు, దానిపై ఆవ్యక్తులకు ఏర్పడే ఆదరం ఎక్కువగా ఉంటుంది అనేది మాత్రం నిజం.

ఇదే విధంగా, "ఆళ్వారులు అనుగ్రహించిన దివ్యప్రబంధాలలో ఉండే నాలుగు వేల పాశురాలు అందరి కోసం అనుగ్రహింపబడ్డాయి" అని అన్నప్పుడు, "ఈ పాశురాలు ముక్తిని కలిగించే పాశురాలు. చిన్న వయస్సులో ఉండే మనకు

వీటితో ఏమి పని? మన వయస్సు చూస్తే, ఐదునుండి పది సంవత్సరాల లోపల ఉన్నది. పెద్దవారికి పనికి వచ్చే పాశురాలను తెలుసుకొని మనకు ఏమి ఉపయోగం ఉన్నది?" అని భావించి వాటిని చిన్న వయస్సులో ఉండేవారు వదిలి పెట్టవచ్చు.

ఆ విధంగా కాకుండా "ఇదిగో! ఈ ప్రబంధం మీకోసంగా, చిన్నపిల్లల కోసంగా ఉన్నది. అందువల్లనే చూడండి ఈ ప్రబంధంలో "శెల్వ చ్చిఋమీర్ కాళ్!" అని, "క*ఱ్ఱు* క్కఱవై క్కణంగళ్"అని గోదాదేవి అనుగ్రహించింది. అందువల్ల ఈ ప్రబంధం ప్రత్యేకంగా మీకోసమే గోదాదేవి అనుగ్రహించింది" అని తెలియజేస్తే, అప్పుడు చిన్న వయస్సులో ఉండేవారికికూడా ఈ తిరుప్పావై ప్రబంధంపై తప్పక ఆసక్తి, " అందులో ఏమున్నది? ఏమి చెప్పబడింది? తెలుసుకోవాలి" అనే జిజ్ఞాస కలుగుతాయి.

మరి ఒక విషయం. "ఆళ్వారుల పాశురాలలో చిన్న పిల్లలకు ప్రసక్తి లేదు, ఆడవారికి అవకాశం లేదు" అని భావించడం కానీ, ఆ విధంగా చెప్పడం కానీ సరి కాదు. ఉదాహరణకు, ఈ తిరుప్పావై ప్రబంధాన్నే చూడండి" అని తెలియజేయాలి.

ఇది మార్గశీర్ష మాసం. పెద్దలం అయిన మనం ఈ వివరాలను చిన్నపిల్లలకు తెలియజేయాలి. "వీరింకా చిన్నపిల్లలు, వీరికి ఈ ప్రబంధాలతో ఏమి ఉపయోగం ఉన్నది? " అని అనుకోకుండా, "ఈ తిరుప్పావై ప్రబంధం చిన్న పిల్లలకై ప్రత్యేకంగా ఉన్నది. " అని చిన్నతరంలో ఉండేవారికి అందరికీ తెలియజేయవలసిన కర్తవ్యం మనకు ఉన్నది. అప్పుడే గోదాదేవి అభిమతాన్ని మనం పూర్తి చేసినవారం కాగలము. ఆ తల్లి విషయంలో మనకు ఉండే ఋణాన్ని కొంతవరకైనా తీర్చుకున్నవారం కాగలము. స్వస్తి.

★★★★★

# గోదాసూక్తిసౌందర్యం –పూర్వాచార్యవ్యాఖ్యాన వైభవమ్

(గోదాదేవి అవతారోత్సవాల సందర్భంగా)

గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలో "అన్ఱు ఇవ్వులగమ్ అళందాయ్ అడి పో*ర్ఱి*" అనేది 24వ పాశురం. అందులోని మొదటి వాక్యంలో గోదాదేవి త్రివిక్రమావతారానికి "అన్ఱు ఇవ్వులగమ్ అళందాయ్ అడి పో*ర్ఱి*" అని మంగళాశాసనం చేస్తున్నది. "ఆనాడు ఈ లోకాన్ని నీ శ్రీపాదంతో కొలిచావు" అని మంగళాశాసనం చేస్తున్నది. లోకాలను అన్నిటిని కొలిచిన త్రివిక్రమ స్వామి పాదానికి మంగళం పాడుతున్నది. ఎత్తు పల్లాలు, అరణ్యాలు పర్వతాలు, నదులు భూమి అనే ఏ తేడా లేకుండా, అంతటా త్రివిక్రమ భగవానుడు తన శ్రీపాదంతో స్పృశించాడు. " తాళాల్ ఉలగ మళంద ఆశైవే కొల్!" శ్రీపాదంతో లోకాలను కొలిచిన శ్రమ వల్లనా నీవు శయనంపై పరుండి ఉన్నావు అని సన్నివేశాన్ని ముదల్ ఆళ్వారులు కూడా కీర్తించారు. ఇటువంటి అరుదైన లీలలను చేసినందువల్ల పరమాత్మ శ్రీచరణం ఎంతో శ్రమపడి ఉంటుందికదా. ఆ కారణం వల్ల "అడి పో*ర్ఱి* "అని భగవంతుని పాదానికి గోదాదేవి మంగళం పాడింది.

ఈ పాశురంలోనే, రెండు పాదాలకు తరువాత, అంటే, నాలుగవ పాదంలో, ", కన్ఱు కుణిలా ఎరిందాయ్ క*ழల్* పో*ర్ఱి*" (లేగ దూడను విసరి కొట్టే దండంగా ప్రయోగించిన నీ పాదానికి మంగళం) అని అంటూ మళ్ళీ పాదానికి గోదావరి మంగళం పాడింది. "ఆడి "అన్నా పాదమే, "క*ழల్* "అన్నా పాదమే. ఈ విధంగా పలికిన "అడి పో*ర్ఱి*" అనేదానికి, పో*ర్ఱి*" అనేదానికి ఏమిటి తేడా? రెండు పాదాలే కదా. "తాళ్, పాదమ్, పొన్నడి, ఇణైయడి, తిరువడి" అని పలు విధాలుగా

ఆళ్వారులు పాడుతారు. ఇప్పుడు ప్రస్తుతం గోదావరి సూక్తిలోని ఒకే అర్థాన్ని ఇచ్చే రెండు పదాలలో ఏమి తేడా? అర్థంలో ఏమి తేడా ఉన్నది? గమనించి చూద్దాం.

"అన్రు ఇవ్వుకగమ్ అళందాయ్ అడి పో*ఱ్ఱి*" అని మంగళాశాసనం చేసిన సమయంలో గోదాదేవికి, భూమిపై స్వామి మోపిన పాదం గోచరిస్తున్నది. అంటే, ఆ పాదం పైభాగమే దర్శనమిస్తున్నది. భగవానుడు త్రివిక్రమావతారాన్ని ఎత్తినప్పుడు ఒక పాదంతో భూమిని కొలిచాడు వేరొక పాదంతో పై లోకాలను కొలిచాడు. ఈ విధంగా కుడి ఎడమ పాదాలతో భగవానుడు భూలోక, పై లోకాలను కొలిచినపుడు భగవానుని పాదంలోని పైభాగమే గోచరిస్తుంది. అందువల్ల గోదాదేవి నీలవర్ణంతో ప్రకాశించే భగవంతుని పాదాల పై భాగాన్ని దర్శించి, దానికి మంగళం పాడుతున్నది. పాదం భూమిపై పెట్టినప్పుడు పాదం పై భాగమే గోచరిస్తుంది తప్ప క్రింది భాగం కనబడదు. ఆ విధంగానే, వేరొక పాదంతో పై లోకాలని కొలిచినప్పుడు కూడా పాదం పైభాగమే గోచరిస్తుంది గానీ, క్రింది భాగం కనిపించదు ఎందుకంటే, ఆ సన్నివేశంలో పాదం పైభాగం క్రింది దిశగా ఉంటుంది, క్రింది భాగం పై దిశలో ఉంటుంది. అప్పుడు ఆ భూమిపై ఉండేవారు పాదం పై భాగాన్ని చూడగలరు కాని, క్రింది భాగాన్ని చూడలేరు. అందుచేత, భగవానుడు లోకాలను కొలిచినపుడు నీలవర్ణంతో ప్రకాశించే ఆ స్వామి పాదాలపై భాగమే గోదాదేవికి గోచరించింది. దానిని ఇక్కడ "ఆడి" అనే శబ్దంతో నిర్దేశించారు.

కానీ నాల్గవ పాదంలో, "కన్రు కుణిలా ఎరిందాయ్ క*ழ*ల్ పో*ఱ్ఱి*" అనే ప్రయోగంలో "క*ழ*ల్" అనే పదానికి కూడా పాదం అనే అర్థం. అయితే, ఈ పదం ఇక్కడ, సందర్భాన్ని అనుసరించి, భగవంతుని పాదంలోని క్రింది భాగాన్ని తెలియజేస్తున్నది. అది ఏ విధంగానో గమనిద్దాం. ఇక్కడ ప్రస్తావింపబడిన

వృత్తాంతం ఏమంటే, వెలగపండు రూపంలో ఉండే అసురునిపై లేగదూడ రూపంలో ఉండే అసురుని సాధనంగా చేసికొని విసరి, ఆ ఇద్దరినీ వధించడం. వెలగ చెట్టులో ఉండే పండు రూపంలో కపిత్థాసురుడు, భూమిపై లేగదూడ రూపంలో వత్సాసురుడు అని ఇద్దరు అసురులు ఉన్నారు. వీరిద్దరినీ కంసుడు శ్రీకృష్ణుని వధించడం కోసం రేపల్లెకు పంపించాడు. శ్రీకృష్ణుడు చాలా కుశలంగా క్రింద ఉండే లేగ దూడను చేతి కర్రవలె చేసికొని, వెలగ చెట్టు పైకి వేగంగా విసిరాడు. ఆ లేగ దూడ వెళ్లి వెలగ చెట్టుపై ఉండే పండు రూపంలో ఉన్న అసురునకు తగిలింది. దానితో ఆ ఇద్దరు అసురులు మరణించారు.

కింద ఉండే లేగ దూడను చేతి కర్రవలె తిప్పి తిప్పి ప్రయోగించాలి అంటే, దానికి అధికమైన శక్తి అవసరం. అందువల్ల శ్రీకృష్ణుడు ఆ లేగదూడను విసరి కొట్టేటప్పుడు, తన ఒక పాదాన్ని కొంచెం పైకెత్తి లేగ దూడను విసిరాడు. "దీనికే కుంచిత పాదం అని పేరు" అని అరుంబదకారులు కూడా వివరిస్తారు. ఒక పాదాన్ని కొంచెం పైకెత్తి, మోకాళ్ళ పైకి వంగి, లేగ దూడను శ్రీకృష్ణుడు విసరి కొట్టాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు తన ఒక పాదాన్ని పైకి ఎత్తాడు కనుక, గోదాదేవి ఆ సన్నివేశంలో, ఎర్రని వర్ణంతో మెరిసే ఆ పాదంయొక్క క్రింది భాగాన్ని దర్శించి, ఆ పాదానికి మంగళాశాసనం పాడుతున్నది.

త్రివిక్రమావతార సందర్భంగా భగవంతుని నల్లని వర్ణాన్ని కలిగిన పాదాల పై భాగమే గోచరించగా, ఇక్కడ ఎర్రగా ప్రకాశించే పాదం కింది భాగం గోచరించింది. దీనిని ఇక్కడ గోదాదేవి " *కழల్* పో*ற்றி*" అని నిర్దేశించింది. అందుచేత "ఆడి పో*ற்றி*, *కழల్* పో*ற்றி*" అనే ప్రయోగాలు పై పైన చూసినప్పుడు ఒకే అర్థాన్ని ఇస్తున్నట్లు కనిపించినా, సన్నివేశాలలోని తేడాలనుబట్టి అవి వేరు వేరు వేరు

అర్థాలను ఇస్తున్నాయి. "ఆడి" అనేది పాదం పై భాగాన్ని "కழల్ "అనేది పాదం క్రింది భాగాన్ని తెలుపుతున్నవి. ఎంతటి అందమైన ప్రయోగం ఇది!

ఈ విధంగా ఉండే గోదాదేవిసూక్తి లోని సౌందర్యాన్ని పొగడదామా? లేక, ఆ సూక్తి లోని తాత్పర్యాన్ని గ్రహించి వ్యాఖ్యానించే మన పూర్వాచార్యుల మేధావిలాసాన్ని కొనియాడదామా?. ఏనాడో జరిగిన త్రివిక్రమావతార సందర్భాన్ని శ్రీకృష్ణావతార వృత్తాంతాన్ని ప్రత్యక్ష సమానాకారంగా దర్శించి, దానిని తన సూక్తులతో మనకు తెలియజేసే గోదాదేవసూక్తి వైభవాన్ని ఏమని పొగడగలం. ? ఆ విధంగా ఉండే గోదాసూక్తిలోని గాంభీర్యాన్ని గ్రహించి, వివరించే మన పూర్వాచార్యుల వ్యాఖ్యాన చాతురిని ఏమని పొగడగలం? వారు ఈ విధంగా వివరించగలుగుతున్నారంటే, అది అంతా భగవంతుని దివ్యానుగ్రహం, నమ్మాళ్వారుల దివ్యానుగ్రహమే కారణం. అందువల్లనే వీరు ఆ విధంగా వ్యాఖ్యానించగలిగారు.

త్రివిక్రమావతారం, కృష్ణావతారం అనేవి ఎప్పుడో, వేరు వేరు కాలాలలో సంభవించాయి. అయినప్పటికీ, ఆ సందర్భాలను ప్రత్యక్షంగా దర్శించి, వాటిని మన కంటికి గోచరం అయ్యేటట్లుగా మన పూర్వాచార్యులు వివరిస్తున్నారు. దివ్యప్రబంధ సూక్తులలో ఎంతటి గాఢమైన అభినివేశం, అవగాహన వీరికి ఉన్నదో కదా!

"అడి" అనే పదం ఏ అర్థాన్ని చెబుతున్నది? "కழల్ "అనే పదం ఏ అర్థాన్ని చెబుతున్నది? ఏ అనుభవాన్ని గోదాదేవికి ఈ పదాలతో వ్యక్తం చేస్తున్నది? అని మహోదారులైన మన పూర్వాచార్యులు స్పష్టంగా దర్శించి, మనకు తెలియజేస్తున్నారు.

గోదాదేవికి, మన పూర్వాచార్యులకు మన స్వరూపానికి తగినట్టుగా పలాండు పాడదాం.

★★★★★

# తిరుప్పావై ప్రబంధం – ఈశావాస్యవిద్య

ఈశావాస్య విద్యను ఈశావాస్యోపనిషత్తు తెలియజేస్తున్నది. ఈ చరాచరప్రపంచంలో అంతటా భగవంతుడు వ్యాపించి ఉన్నాడని గ్రహించి, విధ్యుక్తకర్మలను ఆచరిస్తూ, బ్రహ్మోపాసనం చేసిన ఉపాసకుడు అమృతత్వాన్ని పొందుతాడు – అని ఈ విద్య బోధిస్తున్నది.

"ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్,
తేన త్యక్తేన భుంజీథాః మాగృధః కస్యచిద్ధనమ్"

కంటికి కనిపించే ఈ చరాచరప్రపంచం అంతా అందరినీ నియమించేవాడైన శ్రీమన్నారాయణునిచేత వ్యాప్తమై ఉన్నది. ఈ ప్రపంచంలోనే పదార్థాలను అనుభవించు, కానీ, వాటిపై ఏ ఆసక్తి లేకుండా అనుభవించు. బ్రహ్మవిద్యను పొందడానికి కర్మలను ఆచరించాలి. కర్మలను ఆచరించడానికి దేహాన్ని ధరించాలి. అందువల్ల ఈ దేహం నిలబడడానికి ఎంత ఆవశ్యకమో, అంతే అనుభవించు. ఆ అనుభవంలో కూడా ఇతరుల ధనాన్ని ఆశించకు.

భగవంతుని ఆరాధించడంకోసంగానే ఈ శరీరం నీకు లభించింది. ఇది ఎన్నాళ్ళు ఈ లోకంలో ఉండాలో, అంతకాలం ఉండి తీరవలసిందే. నీకు విధింపబడిన కర్మలను ఆచరిస్తూ జీవించవలసినంత కాలం జీవనాన్ని సాగిస్తూ ఉండాలి.

"విద్యాం చావిద్యాం చ య స్తద్వేదోభయగ్ం సహ,
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా ఽ మృత మశ్నుతే"

మోక్షాన్ని పొందాలని కోరేవాడు బ్రహ్మోపాసనను, కర్మాచరణను చేయడానికి వాటి మధ్య ఉండవలసిన అంగాంగిభావాన్ని గ్రహించి, ఆ రెండిటినీ కలిపే ఆచరించాలి – అనే విషయాన్ని గ్రహించాలి. అప్పుడు అవిద్యతో మృత్యువును దాటాలి, అంటే, ఫలంలో ఏ విధమైన అభిసంధి లేకుండా, వర్ణాశ్రమాలకు తగిన

ధర్మాలను అనుసరించి, ఆచరించవలసిన కర్మలను ఆచరిస్తూ ఉండాలి. ఇటువంటి కర్మలను ఆచరించడం వల్ల బ్రహ్మవిద్య కలగడానికి అడ్డుగా ఉండే ప్రాక్తన పాపసమూహం అంతా నశించిపోతుంది. అప్పుడు బ్రహ్మోపాసన సిద్ధిస్తుంది. దానివల్ల అమృతత్వాన్ని ఉపాసకుడు పొందగలడు.

ఇక్కడ, అవిద్య అంటే, కర్మాచరణ. విద్య అంటే, బ్రహ్మోపాసన – అని అర్థం.

"సంభూతిం చ వినాశం చ య స్తద్వేదోభయగ్ం సహ,
వినాశేన మృత్యుం తీర్త్వా సంభూత్యా ౭ మృత మశ్నుతే"

బ్రహ్మప్రాప్తిరూపఫలం దానికి అడ్డుగా ఉండే ఈ శరీరం తొలగిపోవడం – అనే ఈ రెండు అంగాంగిభావాన్ని కలిగినవై ఉన్నాయని ఉపాసకుడు తెలుసుకోవాలి. ప్రతిబంధకాలు ఏ విధంగా తొలగిపోతాయో, ఆ క్రమాన్ని తెలిసికోవడంద్వారా ప్రతిబంధకాలను తొలగించుకోవాలి, బ్రహ్మప్రాప్తిరూపమైన ఫలజ్ఞానంవల్ల సాధకుడు బ్రహ్మన్ని పొందుతాడు. అంటే, మొదటిదానివల్ల శరీర నాశనం, రెండవ దానివల్ల అమృతత్వప్రాప్తి కలుగుతాయి.

కర్మలను ఆచరించేటప్పుడు, బ్రహ్మన్ని ఉపాసించేటప్పుడు "ఈశావాస్య మిదగ్ం సర్వమ్" – "ఈ ప్రపంచంలో అంతటా భగవంతుడు వ్యాపించి ఉన్నాడు" అనే భావనతో ఉండాలి. అప్పుడే, తాను ఆ భగవంతునకు శేషభూతుడనని, ఆయన అందరికీ శేషి అని అటువంటి భగవంతుడే తనకు ప్రాప్యుడని, అతనిని పొందడానికి ప్రతిబంధకంగా మిగిలి ఉండే శరీరాన్ని, పాపరాశిని తనకు విధింపబడిన కర్మలను ఆచరించడం ద్వారా నశింపజేసుకుని, ఆ పరమాత్మను పొందాలన్న ఉపాసకుని సంకల్పం సిద్ధిస్తుంది.

ఇది, సంగ్రహమైన ఈశావాస్యవిద్యా స్వరూపం.

ఈ విద్యా ప్రస్తావన తిరుప్పావై ప్రబంధంలో "నో*ఱ్ఱు* చ్చువర్ క్క్రమ్" అనే పదవ పాశురంలో గోచరిస్తున్నదని భావించవచ్చు. ఏ విధంగా? అంటే,

ఈ పాశురంలో, బయట ఉండే కొందరు గోపికలు, తన ఇంటి లోపల నిద్రపోతున్న ఒక గోపికను నిద్ర లేపే సందర్భం గోచరిస్తుంది. బయటి గోపికలు, లోపల ఉండే గోపికను ఉద్దేశించి పలుకుతూ " అమ్మా! నీవు మేము నిన్ను పిలిచినప్పటికీ, నీవు తలుపులు తెరచి, నీ ఇంటి లోపలకు మమ్ములను ఆహ్వానించడంలేదే! మమ్ములను లోపలకు ఆహ్వానించకపోయినా, నీవు కనీసం నోరు తెరచి ఏ సమాధానం చెప్పడం లేదే? నీ సన్నిధిలో ఉండే శ్రీకృష్ణుని మాకు అనుగ్రహించకపోయినా, కనీసం నీ మాటను అయినా అనుగ్రహించకూడదా? నీ వాఙ్మాధుర్యాన్ని మాకు అనుభవింపజేయకూడదా?" అని అన్నారు

అప్పుడు లోపల ఉండే గోపిక "మీరు ఈ విధంగా నన్ను ఆడిపోసుకున్నారేమి? ఆ శ్రీకృష్ణభగవానుడు ఇక్కడ ఉన్నాడా? ఏ విధంగా మీరు స్వామి ఇక్కడ ఉన్నాడని తెలుసుకున్నారు? " అని అడిగినది. అప్పుడు బయటి గోపికలు సమాధానంగా " నా*ఱ్ఱ* త్తు*ழ*ాయ్ ముడి నారాయణన్" (పరిమళించే తులసిని తన కురులలో కలిగిన, సర్వవ్యాపకుడైన నారాయణుడు) అనే ఒక పదప్రయోగాన్ని చేశారు. " నీవు అతనిని దాచిపెట్టినా, అతడు ప్రయత్నానికి సహకరించి దాగుకొన్నా, శ్రీరంగంలోని చందనపు సువాసనను దాసడానికి వీలులేని విధంగా, అతడు తన శిరస్సులో అలంకరించుకున్న తులసినుండి వెలువడే పరిమళాన్ని నీవు దాచగలవా? భగవానుడు సర్వవ్యాపి అయిన నారాయణుడు కదా! స్వామిని సమీపంలో ఉన్నాడు – అనే విషయం మాకు తెలుస్తున్నది లే!" అని భావం. ఈ విధంగా ఇక్కడ గోపికలు భగవానుని సర్వవ్యాపకత్వాన్ని తెలియజేసే నారాయణశబ్దాన్ని ప్రయోగించి, "ఈశావాస్యమిదగ్ం సర్వమ్" అనే ఈశావాస్యవిద్యా స్వరూపాన్ని అనుసంధించినట్లయినది.

అందుచేత, ఇక్కడ ఈశావాస్యవిద్య ధ్వనిస్తున్నదని చెప్పవచ్చు. స్వస్తి.



# తిరుప్పావై కాలక్షేపం చెప్పడంలో, వినడంలో ఏమి యోగ్యత?

ఈ సంవత్సరం ధనుర్మాసం రేపటితో పూర్తి కావస్తున్నది. అతిపవిత్రమైన ఈ ధనుర్మాసకాలంలో ప్రపంచంలో అంతటా, ఆస్తికులై ఉండేవారు అందరూ, గోదాదేవి ఆచరించి లోకానికి ఉపదేశించిన ధనుర్మాస వ్రతాన్ని, ఆచరించి ఆమె అనుగ్రహించిన ఆ వ్రతవైభవాన్ని తెలియజేసే తిరుప్పావై ప్రబంధంలోని విశేషార్థాలను పలు విధాలుగా తెలిసికొని ఆనందిస్తున్నారు ఈ ప్రబంధానికి ప్రాచీనులైన మన పూర్వాచార్యులు పలువురు, ఆ విధంగానే, ఈ మధ్యకాలంలో ప్రసిద్ధులైన పండితులు పలువురు వెలయించిన వ్యాఖ్యానాలను ఆధారంగా చేసుకుని ఉపన్యాసకులు తమ ప్రవచనాలను అందిస్తున్నారు. ఆసక్తి కలిగిన ఆస్తికులైన శ్రోతలు కూడా ఆ ప్రవచనాలలోని మాధుర్యాన్ని అనుభవించి ఆనందిస్తున్నారు. ఇది చాలా సంతోషించదగిన విషయమే, సందేహం లేదు.

కానీ, ఈ ప్రబంధం అధ్యయనం చేయడానికి కానీ, ఈ ప్రబంధంలోని తత్వాలను పరిపూర్ణంగా గ్రహించడానికానీ, ఒకవేళ పరిపూర్ణంగా గ్రహించిన పెద్దలు ఎవరైనా ఉంటే, వారు అనుగ్రహించే ప్రవచనాలను వినడానికి కానీ, విని వంట పట్టించుకోవడానికి కానీ, ఏ విధమైన అర్హతను కలిగి ఉండాలి? అనే విషయం కూడా విచారించవలసిన ఉన్నది. అయితే, మనం ఇప్పుడు ఈ విషయంలో కొత్తగా విచారించి నిర్ణయం చేయవలసిన ఆవశ్యకత ఏమీ లేకుండానే, ఆచార్య సార్వభౌములైన భగవద్రామానుజులే ఒక నిశ్చితమైన తమ అభిప్రాయాన్ని మనకు తెలియజేశారు. ఈ ప్రబంధాన్ని గూర్చి ప్రవచించడానికి, తిరుప్పావై

తిరుప్పావై కాలక్షేపం చెప్పడంలో, వినడంలో ఏమి యోగ్యత?

ప్రబంధప్రవచనాలను ఆలకించడానికీ ఎవరికి యోగ్యత ఉన్నది? అనే విషయంలో వారు స్పష్టమైన తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. దానిని కొంచెం గమనిద్దాం. ద్రావిడవేదం అని, నాలాయిర దివ్యప్రబంధం అని ప్రసిద్ధి చెందిన, ఆళ్వారులు అనుగ్రహించిన దివ్యప్రబంధాలలో తిరుప్పావై ప్రబంధానికి ఉండే ప్రత్యేకత చాలా గొప్పది. దానికి రెండు కారణాలు ఉన్నాయి. అందులో ఒకటి, సాక్షాత్తు జగన్మాత అయిన భూదేవి గోదాదేవి రూపంలో అవతరించి అనుగ్రహించిన దివ్యప్రబంధం కావడం కాగా, రెండవది, ఈ ప్రబంధం వేదానికి అంతటికి బీజం వంటిది కావడం.

ఈ ప్రబంధానికి పూర్వాచార్యులు అనుగ్రహించిన నాలుగు వ్యాఖ్యానాలు ఇప్పుడు లభిస్తున్నాయి. ఈరాయిరప్పడి, మువాయిరప్పడి, నాలాయిరప్పడి, ఆఱాయిరప్పడి అనేవి ఆ నాలుగు వ్యాఖ్యానాలు. వీటిలో ఈరాయిరప్పడి, నాలాయిరప్పడి అనే రెండు వ్యాఖ్యానాలను తిరునారాయణపురానికి చెందిన ఆయ్ జనన్యాచార్య స్వామివారు అనుగ్రహించారు. నాలాయిరప్పడి వ్యాఖ్యానం అవతారికలో జనన్యాచార్యస్వామివారు భగవద్రామానుజులవారికి సంబంధించిన ఒక సూక్తిని ఈ విధంగా ఉదాహరించారు.

"ఎమ్బెరుమానారై – "ఓర్ ఉరు తిరుప్పావైక్కు అర్థమ్ అరుళిచ్చెయ్యవేణుమ్" ఎన్న, "తిరుప్పల్లాండుక్కు ఆళ్ కిడక్కినుమ్, తిరుప్పావైక్కు ఆళ్ కిడైయాదు" ఎన్ఱు అరుళిచ్చెయ్ దార్. "మోవా ఎழுన్ద మురడర్ కేట్కైక్కు అధికారికళ్ అల్లర్. ములై ఎழுన్దార్ కేట్కవేణుమ్. అవర్ కళిలుమ్, పరివాణిచ్చికళాన పిరాట్టిమార్ క్కుమ్ కేట్కు నిలమల్ల. పల శొల్లి ఎన్? పత్తు ఆழ்వార్ కళుడైయ సారభూతైయాన తానే శొల్లి త్తానే కేట్కు మిత్తనై" ఎన్ఱు అరుళిచ్చెయ్ దార్. "

ఈ సూక్తిలోని తాత్పర్యం ఏమంటే,

"ఒకసారి, తిరుప్పావై ప్రబంధానికి అర్థాన్ని అనుగ్రహించాలని కొందరు శిష్యులు భగవద్రామానుజులను ప్రార్థించారు. అప్పుడు వారు "పెరియాళ్వార్లు అనుగ్రహించిన తిరుప్పల్లాండు ప్రబంధానికి తగిన శ్రోతలు లభించినా లభించవచ్చు, కానీ, గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధానికి మాత్రం వినడానికి అర్హత కలిగిన శ్రోతలు లభించడం చాలా అరుదు" అని, "ఈ తిరుప్పావై ప్రబంధాన్ని చెప్పడానికి, వినడానికి నిజానికి మీసాలు మొలచిన మగవారు యోగ్యత కలిగినవారు కాదు. స్తనోద్భేదం కలిగిన స్త్రీలు మాత్రమే ఈ ప్రబంధంలోని అర్థాలను వినడంలో అర్హతను కలిగినవారు. వారిలో కూడా, చాలా ప్రేమ కలిగిన మిగిలిన దివ్యదేవేరులకు కూడా వినడానికి యోగ్యత లేదు. అంత ఎందుకు? అళ్వార్లు పదిమందికి ఒకే స్త్రీసంతానమైన గోదాదేవి మాత్రమే తానే ఈ ప్రబంధాన్ని గూర్చి పలకాలి, తానే వినాలి, అంతే " అని సమాధానం చెప్పారు.

ఈ విధంగా అనడం ద్వారా శ్రీరామానుజులు – "తిరుప్పావై ప్రబంధంలోని అర్థాన్ని గోదాదేవి మనస్సుకు తగినట్లుగా చెప్పడానికి నేనుకూడా యోగ్యతను కలిగినవాడను కాను, వినడానికి మీరుకూడా యోగ్యత కలిగినవారు కారు" అనే అభిప్రాయాన్ని వ్యక్తం చేసినట్లు అయినదికదా!.

ఇదే విషయాన్ని, ఈ ప్రబంధంలోని ఎనిమిదవ పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ నాలాయిరప్పడి వ్యాఖ్యానంలో నాయనార్ అనే ఆచార్యులు, గోదాదేవి అనుగ్రహించిన రెండవ ప్రబంధం అయిన నాచ్చియార్ తిరుమొழిలోని (13 –1) వ పాశుర వ్యాఖ్యానంలో పెరియ వాచ్చాన్ పిళ్ళై ఉదాహరించారు. అయితే, ఈ అర్థాన్ని భట్టర్ అనుగ్రహించినట్లుగా అక్కడ చెప్పబడింది. బహుశః రామానుజులవారు తెలియజేసిన ఈ అర్థాన్ని భట్టర్ అనువదించి ఉండవచ్చు.

ఇక్కడ ఒక విషయాన్ని మనం జాగ్రత్తగా గమనించాలి. భగవద్రామానుజులవారు పలికిన పై సూక్తిలోని తాత్పర్యం ఏమి? తిరుప్పావై

తిరుప్పావై కాలక్షేపం చెప్పడంలో, వినడంలో ఏమి యోగ్యత?

ప్రబంధంలోని అర్థాన్ని చెప్పమని తమను అడిగినవారు మగవారు అని, వారిచే ప్రార్థింపబడిన తాము కూడా మగవారే అని మాత్రమే భావించి, శ్రీరామానుజులు పై విధంగా సమాధానాన్ని చెప్పారా? ఇంత మాత్రమేనా, పై సమాధానంలోని తాత్పర్యం? ఎంతో విశాలహృదయులుగా, దయాస్వభావమే మూర్తీభవించినవారుగా చెప్పబడే భగవద్రామానుజులు ఈ విధంగా అనడంలో ఏమిటి పరమార్థం? గమనించాలి కదా!

ఈ భగవద్రామానుజుల సూక్తిలో నిర్దేశింపబడిన, "మగవారై ఉండడం" అనే, తిరుప్పావై ప్రబంధంలోని అర్థాన్ని వినడానికి అనర్హతను కలిగించే కారణం కేవలం బాహ్యరూపంలో మగవారై ఉండడం అని అర్థం కాదు. మగవారి రూపంలో ఉండడం, ఆడవారి రూపంలో ఉండడం – అనే ఈ భేదం ఆ యా జీవులు చేసుకున్న కర్మలనుబట్టి ఏర్పడివదే కదా. ఈ బాహ్యామైన ఆకార భేదాలువల్ల ఆత్మల యోగ్యతా నిర్ణయం చేయబడదు. మరి దేనిని బట్టి చేయబడుతుంది? దేనిని దృష్టిలో పెట్టుకొని శ్రీరామానుజులు పై సూక్తిని పలికారు? అనే విషయం ఆలోచించవలసినదే.

"స ఏవ వాసుదేవోసౌ సాక్షాత్ పురుష ఉచ్యతే,
స్త్రీప్రాయ మితరత్ సర్వమ్"

(ఆ వాసుదేవుడు ఒక్కడు మాత్రమే పురుషుడని చెప్పదగినవాడు. మిగిలిన జీవులు అందరూ అతని విషయంలో స్త్రీలవంటివారే) అని శాస్త్రాలు చెబుతున్నాయి. అష్టాక్షరీ మహామంత్రంలో ఉండే ప్రణవంలోని ఉకారంద్వారా ఆత్మ పరమాత్మల భర్తృభార్యాసంబంధం సూచింపబడుతున్నది అని మన పూర్వాచార్యుల వివరణం. భార్య, ఆమె భర్తకు మాత్రమే చెందినదై, అనన్యార్హశేషమై ఉండడం లోకంలో ప్రసిద్ధమే. భగవానునకు జీవులు అందరూ ఆ విధంగానే అనన్యార్హశేషత్వాన్ని కలిగినవారై ఉన్నారు. ఈ తత్వమే సారంగా తిరుప్పావై ప్రబంధంలో ప్రతిపాదింపబడినది. "పారార్థ్యం స్వం శ్రుతిశతశిరఃసిద్ధ

మధ్యాపయంతీ" అని భట్టర్ కూడా తిరుప్పావై తనియన్ శ్లోకంలో ఈ విషయాన్ని అనుగ్రహించారు.

ఆత్మ పరమాత్మల మధ్య ఉండే ఈ పతిపత్నీ న్యాయాన్ని వేదాంతాలు, వాటి అర్థాన్ని వివరించే ఇతిహాసాలు, పురాణాలు, పరమవైదికులైన ఆళ్వార్లు అనుగ్రహించిన దివ్యప్రబంధాలు వివరిస్తూ ఉన్నప్పటికీ, ఈ తిరుప్పావై ప్రబంధంలో ఆ అర్థం సారమైన అర్థంగా ప్రతిపాదింపబడింది. దీనిని గ్రహించి ఉపన్యాసరూపంగా ఇతరులకు అందజేయాలన్నా, ఆ ప్రవచనాలను విని ఒంట పట్టించుకోవాలన్నా, ముఖ్యంగా వక్తలకు, శ్రోతలకు ఉండవలసిన జ్ఞానం "ఆత్మకు, పరమాత్మకు మధ్య అతిముఖ్యమైన సంబంధం భర్తృభార్యా సంబంధం" అనే జ్ఞానమే. భగవానుడైన శ్రీమన్నారాయణుడు ఒక్కడే పురుషోత్తముడు, అతని విషయంలో ఆత్మలమైన మనమందరం, భర్తలకు భార్యలవలె, పరతంత్రులమే. ఆ స్వామి ఆనందానికోసమే ఉపయోగపడవలసినవారం – అనే జ్ఞానాన్ని కలిగి ఉండాలి. ఈ జ్ఞానం లేకుండా ప్రవచనాలు చెప్పినా, లేక, ఆ ప్రవచనాలను ఆలకించినా, దానివల్ల ఏ ప్రయోజనం లేదు, చెప్పడానికి కానీ, వినడానికి కానీ యోగ్యత లేదు – అనే తాత్పర్యమే పై భగవద్రామానుజల సూక్తిలో భాసిస్తున్నది.

తిరుప్పావై ప్రబంధంలోని అర్థాలను ప్రవచనం చెప్పేవారు, వినేవారు అందరూ కూడా ఈ విషయాన్ని తప్పక మనస్సులో పెట్టుకోవాలి. లేకపోతే ఆ ప్రవచనాలు వ్యర్థప్రలాపాలే, అరణ్య రోదనాలే కాగలవు.

(ఈ వ్యాసాన్ని, కేవలం తిరుపావై ప్రబంధంలోని వైభవాన్ని తెలుపడం కోసమే, దాసుడు విజ్ఞాపన చేశాడు. అంతే తప్ప, ఎవరినీ తక్కువ చేసి చెప్పడం కానీ, చూడడం కానీ దాసుని ఉద్దేశం కాదు – అని సహృదయులైన పాఠకులు అందరూ గ్రహిస్తారని మనవి)

★★★★★

# తిరుప్పావై – శ్రీపాంచరాత్రమ్ – 5

తిరుప్పావైలోని మొదటి ఐదు పాశురాలు ఉండే భాగం అవతారికవంటిది. ఇందులో తిరుప్పావై స్వరూపం, చేయడంలో అనుసరించవలసిన నియమాలు, ఆ వ్రతం వల్ల కలిగే ఫలం, ఆ వ్రతం చేయడంలో అన్యదేవతలు కూడా కలిగించే తోడ్పాటు, ఆ వ్రతాన్ని చేయడంలో ఎదురయ్యే ఆటంకాలు తీరే మార్గాలు –అనే అయిదు ఈ విషయాలు క్రమంగా ఐదు పాశురాలలో తెలుపబడ్డాయి. అందువల్ల ఈ ఐదు పాశురాలు ఉండే భాగం ఈ ప్రబంధానికి ఉపోద్ఘాతం వంటిది. అంతే కాదు, అర్థపంచక వివరణ కూడా ఈ ఐదు పాశురాలలో చేయబడింది. అందువల్ల, ఈ భాగం ప్రపత్తిశాస్త్రసంగ్రహంగా కూడా ఏర్పడి ఉన్నది.

ఇక, ఈ వ్రతాన్ని చేయడానికి తగిన అధికారిస్వరూపం వివరంగా తెలుపబడుతున్నది. ఆరవ పాశురం నుండి, 15వ పాశురం వరకు గల పది పాశురాలలో పదిమంది గోపికలను కలుపుకొని ఈ తిరుప్పావై వ్రతాన్ని గోదాదేవి చేయడానికి ప్రయత్నించడం తెలుపబడుతున్నది.

ఈ పది పాశురాలలో, మొదటిది అయిన ఆరవ పాశురంలో "మునివర్ గళుమ్, యోగిగళుమ్" (మునులు, యోగులు –అంటే, భగవద్గుణానుభవనిష్ఠులు, భగవత్ కైంకర్యనిష్ఠులు) అని రెండు విధాలైన అధికారులు ప్రస్తావించబడ్డారు. పాంచరాత్రశాస్త్రక్రమంలో చూసినప్పుడు, మునులు, యోగులు అనే వీరు ఇద్దరు అష్టాంగయోగసిద్ధిని కలిగిన రెండు విధాలైన అధికారులుగా చెప్పదగినవారు. సాత్వత సంహితలో డెబ్బై రెండవ అధ్యాయంలో మానసారాధననుగూర్చి తెలిపే ప్రకరణంలో ఈ విధంగా ఉండే రెండు విధాలైన అధికారులు తెలుపబడ్డారు.

వీరిలో, మునులు అంటే మననశీలురు. " శిందై మఱ్ఱొన్ఱిన్ తిఱత్తదల్లా త్తన్నై దేవపిరానటియుమ్" అని శఠకోపముని చెప్పినట్లుగా ఎల్లప్పుడూ భగవంతుని

స్వరూపరూప గుణవిభూతులను మనస్సులో ధ్యానిస్తూ ఆనందాన్ని అనుభవించేవారు. ఈ విధంగా మానసయాగాన్ని చేసేవారు మునులు.

భగవదనుభవాన్ని పొందే వారు రెండు విధాలుగా ఉంటారు. మానస యాగపరులు, బాహ్యారాధన పరులు అని వారు రెండు విధాలుగా ఉంటారు. మానసారాధనను చేసేవారు మునులు, బాహ్యారాధననుచేసేవారు యోగులు. తిరుప్పావైలో, కొంతమంది గోపికలను మరి కొంతమంది గోపికలు నిద్ర లేపడం అంటే, మానసయాగపరులై ఉండేవారిని బాహ్యారాధనపరులు ప్రబోధించడమే. ఈ ప్రక్రియ ఆరవపాశురం నుండి 16వ పాశురం వరకు పది పాశురాలలో కనబడుతుంది.

ఈ విధమైన మానసికారాధన, బాహ్యారాధనలకు సంబంధించిన విచారం శ్రీభాష్యంలోని నాలుగవ అధ్యాయంలోని నాలుగవ పాదంలో చేయబడింది. అక్కడ, ముక్తునకు శరీరం ఉంటుందా? ఉండదా? అనే విచారం ప్రస్తుతమైనది.

ముక్తావస్థలో రెండు విధాలైన అనుభవదశలు ఉంటాయని చెప్పబడుతున్నాయి. అందులో ఒకటి, సశరీరకమైన దశలో పొందే అనుభవం. శరీరం లేకుండా అనుభవించడం అనేది ఇంకొకటి. ముక్తాత్మకు శరీరం ఉన్నదా? లేదా? అనే ప్రశ్న రాగా, " అభావం బాదరి రాహ" (4 –4– 10) (బాదరి అనే మహర్షి ముక్తునకు శరీరం, ఇంద్రియాలు మొదలైనవి లేవు – అని భావిస్తున్నాడు). శరీరం అనేది కర్మ వల్ల ఏర్పడుతుంది కనుక, ముక్తునకు కర్మనాశనం అవుతుంది కనుక, ముతక్తునకు శరీరం ఉండే అవకాశం లేదని ఆ మహర్షి భావించాడు. కానీ, "భావం జైమినిః వికల్పామననాత్" (4 –4– 11) (జైమినిమహర్షి ముక్తునకు శరీరం, ఇంద్రియాలు మొదలైనవి ఉంటాయి అని భావిస్తున్నాడు, ఎందుకంటే, ముక్తుడు అనేక విధాలుగా అవుతున్నాడు అని శ్రుతి చెబుతున్నది కనుక) అనే బ్రహ్మసూత్రం ప్రకారం, ముక్తునకు శరీరం, ఇంద్రియాలు ఉండవచ్చునని జైమినిపక్షంగా తెలుస్తున్నది. శ్రుతికూడా " స ఏకథా భవతి త్రిథా భవతి, ––సర్వేషు

లోకేషు కామచారో భవతి ---" (ముక్తుడు ఒకటిగా అవుతున్నాడు, మూడు శరీరాలను పొందుతున్నాడు--- అన్ని లోకాలలోనూ ఇష్టం వచ్చినట్లు సంచరిస్తున్నాడు) అని చెబుతున్నది. ఒకే సమయంలో అనేక శరీరాలను ధరిస్తున్నట్లు చెబుతున్నది. అందువల్ల ముక్తాత్మకు శరీరం ఉన్నది – అనేది జైమినిమహర్షి పక్షం.

సిద్ధాంతపక్షం అయిన బాదరాయణపక్షం ఏమంటే, " ద్వాదశహవత్ ఉభయవిధం బాదరాయణో ౭ తః" (4–4–12) (సంకల్ప వశంచేత కొన్ని సమయాలలో ముక్తుడు శరీరం కలవాడుగాను మరికొన్ని సమయాలలో శరీరం లేనివాడుగాను ఉంటాడు – అని బాదరాయణులు భావిస్తున్నారు, ఏ విధంగా అంటే, ద్వాదశాహం అనే యాగం రెండు విధాలయిన వాక్యాల వల్ల సత్రంగాను, అహీనంగాను చెప్పబడుతున్నట్లుగానే.) అనే సిద్ధాంతసూత్రాన్నిబట్టి కొన్ని సమయాలలో శరీరం కలవాడుగాను, మరి కొన్ని సమయాలలో శరీరం లేనివాడుగాను ముక్తుడు ఉంటాడు – అనేది సిద్ధాంతంపక్షం. (యాగం చేసే యజమాని తన స్వప్రయోజనం కోసం చేసిన యాగం అయితే దానికి అహీనమని, లోకక్షేమం కోసం చేసిన యాగం ఐతే, దానికి సత్రం అని పేరు. ఈ విధంగా, ఒకే విధమైన యాగానికి అహీనమని, సత్రమని రెండు విధాలయిన నామాలు ఉద్దేశ్య భేదం చేత ఏర్పడతాయి)

అయితే, మరి, శరీరం లేనప్పుడు ముక్తునకు భగవంతుని అనుభవం ఏ విధంగా కుదురుతుంది? అనే సందేహం రాగా, దానికి సమాధానం " తన్వభావే సంధ్యవదుపపత్తేః" (4 –4 –13) (ముక్తునకు తన వల్ల సృష్టింపబడ్డ శరీరం లేకపోతే, పరమ పురుషునిచేత సృష్టింపబడిన శరీరం మొదలైనవాటితో భగవదనుభవం కుదురుతుంది కనుక, ఏ విధమైన అనుపపత్తి లేదు) అనే సూత్రం ద్వారా తెలుపబడింది.

అందువల్ల, ఇక్కడ తిరుప్పావైప్రబంధంలో మునులని నిర్దేశింపబడిన, లోపల నిద్రించే గోపికల భగవదనుభవం –మానసిక యాగరూపమైన, ముక్తాత్మల అశరీరకమైన భగవదనుభవంవంటిదని, యోగిశబ్దంచేత నిర్దేశింపబడిన, బయట ఉండే గోపికల భగవదనుభవం– బాహ్యారాధనరూపమైన, సశరీరకులైన ముక్తుల భగవదనుభవంవంటిదని తెలుస్తున్నది.

భగవత్సంకల్పాధీనమైన ముక్తాత్మయొక్క సంకల్పానుసారంగా అతనికి శరీరం ఉండవచ్చు, లేకపోవచ్చు– అని బాదరాయణుల అభిప్రాయం. ముక్తుడు శరీరం కలిగి ఉన్నట్లయితే, ఏం చేస్తాడు? శరీరం లేకుండా ఉంటే, ఏ విధంగా అనుభవాన్ని పొందుతాడు? అని అంటే, శరీరం కలిగి ఉన్నప్పుడు తన శరీరంతో, ఇంద్రియాలతో భగవదనుభవాన్ని పొందుతాడు. శరీరం లేనప్పుడు, కేవలం మానసికమైన అనుభవాన్ని పొందుతాడు. నిద్రించేటప్పుడు సుప్తావస్థలో ఏ విధంగా అనుభవాన్ని జీవుడు పొందుతాడో, ఆ విధంగానే, శరీరం లేని స్థితిలో ముక్తుడు భగవంతుని అనుభవాన్ని పొందుతాడు. వీరిద్దరే ప్రస్తుత పాశురంలో మునులని, యోగులని చెప్పబడ్డారు. ఇటువంటి రెండు స్థితులలో ఉండేవారే నిద్రలేపబడే గోపికలు, నిద్రలేపే గోపికలు. వీరే రెండు ప్రకారాలలో తిరుప్పావై ప్రబంధంలో మనకు గోచరిస్తారు.

ఇటువంటి మానసికారాధనపరులు, బాహ్యారాధనపరులు – అనే రెండు విధాలైనవారిని సాత్వత సంహిత " అష్టాంగయోగసిద్ధానాం ––" ఇత్యాది శ్లోకంలో ప్రస్తుతించింది. వీరే ఆరవ పాశురంనుండి పదవ పాశురం వరకు ప్రస్తావింపబడ్డారు– అని చెప్పవచ్చు.

★★★★★

# తిరుప్పావై – శ్రీపాంచరాత్రమ్ – 6

తిరుప్పావై ప్రబంధంలో ఆండాళ్ తల్లి ఆరవ పాశురంనుండి 15వ పాశురం వరకు పది పాశురాలలో మానసికారాధన గూర్చి ప్రస్తావన చేసింది. ఇక 16వ పాశురం నుండి పాంచరాత్రశాస్త్రక్రమంలోని బాహ్యారాధన ప్రక్రియను సూచిస్తున్నది.

ఆ ప్రబంధంలో గోదాదేవి "నాయకనాయ్ నిన్ఱ" అనే పదహారవ పాశురంలో నందగోపాలుని భవనాన్ని కాపలా కసే ద్వారపాలకునకు సుప్రభాతం పాడుతున్నది. భగవదారాధన ఆరంభంలో అష్టాక్షరిని కానీ, వాసుదేవ ద్వాదశాక్షరిని కానీ, విష్ణుషడక్షరిని కానీ అవాహన చేసికొని, ఆరాధనను ఆరంభం చేయాలి. అందువల్ల ఈ మంత్రాల స్వరూపాన్ని తెలియజేయాలికదా. ఈ విధంగా మంత్రావాహన పూర్వకంగా భగవదారాధనను చేసే విధానాన్ని భగవద్రామానుజులు తమ నిత్య గ్రంథంలో నిరూపించారు కూడా.

ఈ మంత్రాల ఉద్ధార క్రమాన్ని పాంచరాత్రశాస్త్రం పలు సంహితలలో తెలిపింది. ఈ క్రమాన్ని గోదాదేవికూడా 15వ పాశురంలో ప్రస్తావించబోతూ ముందుగా 16వ పాశురంలో నందగోపాలుని ద్వారపాలకునకు సుప్రభాతాన్ని పలికే రీతిని తెలుపుతున్నది. ఈ విధంగా ద్వారపాలకారాధన పూర్వకంగా భగవంతుని ఆరాధనను చేసే క్రమాన్ని నిత్యగ్రంథంలో శ్రీరామానుజులు తెలియజేశారు కూడా. శ్రీవైకుంఠగద్యలో కూడా ముక్తుడు" భగవత్పారిషదగణనాయక ద్వారపాలైః కృపయా స్నేహగర్భయా దృశావలోకితః సమ్యక్ అభినందితైః తై రేవానుమతో భూత్వా, భగవంత ముపేత్య" అని ద్వారాపాలకుల అనుమతి పురస్సరంగానే పరమపదంలో పరమపదనాథుని సేవించడం తెలుపబడింది. అందువల్ల అక్కడ ముక్తులు చేసే భగవదారాధనకూడా పాంచరాత్రానుగుణమే – అని చెప్పినట్లయినది.

ద్వారపాలకులనుగూర్చి, వారికి ముందుగా సుప్రభాతాన్ని పలికే క్రమాన్నిగూర్చి పాంచరాత్రశాస్త్రానికి చెందిన పారమేశ్వరసంహిత తెలిపింది.

"చండప్రచండౌ ప్రాగ్ద్వారే యామ్యౌ భద్రసుభద్రకౌ,
పశ్చిమే జయవిజయా వుదక్ ధాతృవిధాతృకౌ"

ఇత్యాదిగా భగవదాలయంలోని ద్వారపాలకులను అర్చించిన తరువాతనే భగవంతుని ఆరాధనను ఆరంభించాలని తెలియజేసింది. ఈ క్రమాన్నే గోదాదేవి "నాయకనాయ్ నిన్ఱ" అనే పదహారవ పాశురంలో అనుసంధించింది.
ఇక, " అంబరమే తణ్ణీరే " అనే 17వ పాశురంలో గోదాదేవి మంత్రోద్ధారక్రమాన్ని సూచిస్తున్నది.

భగవన్మంత్రాలు అనేకం. ముందు ప్రణవాన్ని, చివరిలో నమః శబ్దాన్ని కలిగిన భగవాన్నామం ఏదైనా మంత్రమే అవుతుంది. ఈ మంత్రాలు వ్యాపకమంత్రాలు వ్యాప్యమంత్రాలు అని రెండు విధాలు. భగవంతుని సర్వత్ర వ్యాప్తిని తెలియజేసే మంత్రాలు వ్యాపకమంత్రాలు అనబడతాయి. ఇవి అష్టాక్షరి, వాసుదేవ ద్వాదశాక్షరి, విష్ణుషడక్షరి అని మూడు. అష్టాక్షరికి మూలమంత్రం అని పేరు.

ఈ మూడు వ్యాపకమంత్రాలలో, అష్టాక్షరీమహామంత్రం ప్రధానమైనది. " సర్వ మష్టాక్షరాంతఃస్థమ్" అని ఈ మంత్రం కీర్తింపబడుతున్నది. దీనినే వేదం, మహర్షులు, ఆళ్వారులు, పూర్వాచార్యులు అందరూ విశేషించి ఆదరించారు, అనుసంధించారు. పలు దివ్యదేశాలలోని భగవదాలయాలలో ఈ మంత్రావాహనపూర్వకంగానే భగవదారాధన జరుగుతున్నది. గోదాదేవి "అంబరమే " అని ఆరంభమయే ఈ 17వ పాశురంలో అష్టాక్షరీమంత్రరూపాన్ని తెలుపుతున్నది – అని కానీ, లేక, వ్యాపకమంత్రాలు మూడిటిని తెలుపుతున్నది – అని కానీ చెప్పవచ్చు.

వీటిలో, "అంబరమ్" శబ్దంచేత అష్టాక్షరి చెప్పబడుతున్నది. "తణ్ణీర్" అనే పదంచేత వాసుదేవ ద్వాదశాక్షరి చెప్పబడుతున్నది. "శోఱు" అనే పదం

విష్ణుషడక్షరిని తెలుపుతున్నది – అని చెప్పవచ్చు. అన్నం అనేది షడ్రసోపేతంగా ఉంటుంది. ఈ మంత్రంకూడా షడక్షరి. జలం సర్వత్ర వ్యాపించి ఉంటుంది. "సర్వత్ర వసతీతి వాసుదేవః" అనే వాసుదేవ శబ్దఘటితమైన ద్వాదశాక్షరి భగవంతుడు అంతటా వ్యాపించి ఉండే విషయాన్ని తెలుపుతున్నది. జలానికి తాపహరత్వం సహజగుణం. వ్యూహమూర్తి అయిన వాసుదేవునకు "తాపార్తో జలశాయినమ్" అని చెప్పినట్లుగా తాపహరత్వం ప్రసిద్ధం కదా. అందువల్ల "తణ్ణీర్" అనే పదం ద్వాదశాక్షరీ సూచకం. ఇక, "అంబరమ్" అనే శబ్దం అష్టాక్షరిని సూచిస్తున్నది. "అంబరమ్" అనే శబ్దాన్ని "అంపరమ్" అనే పదానికి వికృతిగా గ్రహించినప్పుడు, అకారాన్ని ప్రధానంగా కలిగినది, అకారంతో ప్రారంభమయ్యేది అనే అర్థాన్ని ఇది ఇస్తుంది కనుక, ఈ పదం అష్టాక్షరీ మంత్రాన్ని సూచిస్తున్నదని చెప్పవచ్చు.

లేక, ఈ పాశురంలో ఉండే "అంబరమ్, తణ్ణీర్, శోఱు" అనే మూడు పదాలు మూల మంత్రం అయిన అష్టాక్షరిని తెలుపుతున్నదని కూడా భావించవచ్చు. "అంబరమ్" అనే శబ్దం ప్రణవాన్ని, "తణ్ణీర్" అనే శబ్దం నమస్సును, " శోఱు"అనే శబ్దం "నారాయణాయ" అనే పదాన్ని సూచిస్తున్నవి. ఏ విధంగా అంటే, "అంబరమ్ " అనే శబ్దాన్ని పూర్వంవలె అకారాన్ని ప్రధానంగా కలిగినది, అకారంలో ప్రధానమైన దృష్టిని కలిగినది అని గ్రహించినప్పుడు, అది ప్రణవాన్ని తెలుపుతుంది. "నమః "అనేది ఆత్మకు పోషకం. " దాసభూతాః స్వతః సర్వే హ్యాత్మానః పరమాత్మనః" అనేది అహిర్బుధ్న్యసంహితావచనంకదా. కైంకర్యాన్ని తెలిపే "నారాయణాయ" అనే పదాన్ని "శోఱు"అనే పదం సూచిస్తుంది. ఆత్మకు అన్నం, భోగ్యం భగవంతుని సేవయే కదా. లేక, "అహమన్నాదో ఽ హమన్నాదో ఽ హమన్నాదః" అని ఉపనిషత్తు పలికినట్లుగా అన్నశబ్దవాచ్యుడైన భగవంతుని తెలిపేది నారాయణ పదమే కదా. అందువల్ల అది "శోఱు" అనే పదాన్ని సూచిస్తుంది– అని చెప్పవచ్చు.

ఈ విధంగా "అంబరమే" అనే ప్రారంభమవుతున్న 17వ పాశురంలో వ్యాపక మంత్రాలు మూడిటియొక్క ప్రస్తావన చేయబడినది – అని కానీ, లేక, మూలమంత్రప్రస్తావన చేయబడినది – అని కానీ చెప్పవచ్చు.

ఆ తరువాత, తిరుప్పావై ప్రబంధంలో ఉండే 18వ, 19వ, 20వ పాశురాలలో పురుషకారస్వరూపిణి అయిన లక్ష్మీదేవిని ఉద్దేశించి పురుషకార ప్రపత్తిని చేసిన సందర్భం గోచరిస్తుంది. ఈ విధంగా మూడు పాశురాలలో నీళాదేవిప్రస్తావనను చేయడం ఆమె ఆకారత్రయ సంపన్న అని సూచించడం కోసమే. లక్ష్మీదేవియొక్క పురుషకార స్వరూపాన్ని లక్ష్మీతంత్రం అనే పాంచరాత్రసంహిత

"లక్ష్మ్యా సహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా,
రక్షకః సర్వసిద్ధాంతే వేదాంతేషు చ గీయతే"

అనే సూక్తిద్వారా తెలిపింది. అందువల్ల ఈ మూడు పాశురాలలో "లక్ష్మీసహితుడైన నారాయణుడే ఆశ్రయణీయుడు" అనే పాంచరాత్ర సంహితలలో ప్రతిపాదింపబడిన విషయం ప్రస్తుతమైనదని తెలుస్తున్నది. "యా మాలంబ్య సుఖేనేమం నిస్తరంతి గుణోదధిమ్" అని సాత్వత సంహితలో కూడా లక్ష్మీపురుషకారం చెప్పబడింది. " మామేకాం దేవదేవస్య మహిషీం శరణం వ్రజేత్" అనే లక్ష్మీతంత్రవచనం కూడా ఉన్నది.

"తత్తువ మన్ను" అనే పదంద్వారా " నారాయణః పరం బ్రహ్మ శక్తి నారాయణీ చ సా, వ్యాపకత్వాది సంశ్లేషాత్ ఏకతత్వమివోదితా" అనే పాంచరాత్రానికి చెందిన అహిర్బుధ్న్యసంహితా సూక్తిద్వారా తెలుపబడిన "లక్ష్మీనారాయణులు ఇద్దరూ ఒకే తత్త్వం" అనే అర్థం సూచింపబడింది.

ఈ విధంగా ఈ ప్రబంధంలో ఎక్కడ చూసినా, మనం, పాంచరాత్రంలో చెప్పబడిన అర్థాలు స్ఫురించడాన్ని భావించవచ్చు.

★★★★★

# పట్టర్ పిరాన్

గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలోని ఫలశ్రుతి పాశురంలో, అంటే, 30వ పాశురంలో, తనను నిర్దేశించుకునేటప్పుడు, తనకు తండ్రి, ఆచార్యులు అయిన పెరియాళ్వారుల నామాన్ని పురస్కరించుకొని " పట్టర్ పిరాన్ కోదై" (భట్టనాథుల గోద) అని అన్నది. "పట్టర్ పిరాన్" అనే ఈ ద్రావిడ నామానికి మూలం "భట్టనాథః" అనే సంస్కృతనామం. ఈ విధంగా సంస్కృత నామాలను ద్రావిడీకరించడం, ద్రావిడ నామాలను సంస్కృతీకరించడం అనే ప్రక్రియ మనకు ఆళ్వారుల ప్రబంధాలలో ప్రచురంగా గోచరిస్తుంది. "కోదై "అనేది ద్రావిడ నామాన్ని మొట్టమొదటగా సంస్కృతీకరించి, , "గోదా" అనే ప్రయోగించినవారు శ్రీపరాశర భట్టారకులు. ఈ ప్రయోగాన్ని వారు తిరుప్పావై తనియన్ శ్లోకంలో చేశారు. అదేవిధంగా, ఇక్కడ భట్టనాథశబ్దం "పట్టర్ పిరాన్" అని ద్రావిడీకరింపబడిందని భావించవచ్చు.

ఈ పదాన్ని కేవలం ఒక వ్యక్తికి చెందిన నామంగా మాత్రం భావించకుండా, దీనిని నాయనార్ అనే పూర్వాచార్యులు ఆఱాయిరప్పడి అనే తమ తిరుప్పావై వ్యాఖ్యానంలో చాలా విలక్షణంగా అందంగా వ్యాఖ్యానించారు. ఈ వివరణం వారి వ్యాఖ్యాన కౌశలాన్ని ఋజువు చేస్తుంది.

సంస్కృత భాషలో భట్ట శబ్దం శాస్త్రర్థతత్వవేది అయిన గొప్ప పండితుని తెలియజేస్తుంది. ఈ శబ్దానికి ఈ అర్థంలో ప్రయోగాలు కనబడుతున్నాయి కూడా. మాలతీ మాధవం అనే సంస్కృతకావ్యంలో " భట్టగోపాలస్య పౌత్రః" అని ప్రయోగింపబడింది. అందువల్ల "పట్టర్ పిరాన్" అనే పదంలోని " పట్టర్" అనే పదం భట్టశబ్దవికృతిగా భావించినప్పుడు, వేదాంత తత్వవేత్త అనే అర్థం దానికి చెప్పవలసి ఉంటుంది. పెరియాళ్వార్లు ఏ ఆచార్యుని వద్ద శాస్త్రాధ్యయనం చేయకపోయినా,

భగవానుని అనుగ్రహం వల్ల సకల శాస్త్రార్థాలను క్షుణ్ణంగా గ్రహించగలిగినవారయ్యారు అని వారి చరిత్ర, "పీదగవాడై పిరానార్ పిరమగురువాకి వందు" (పీతాంబరధారి అయిన పరమాత్మ పరమాచార్యుడై వచ్చి) అని వారు తమ ప్రబంధంలో పలికిన సూక్తి తెలుపుతున్నవి. ఇది "పట్టర్ "అనే పదానికి గల అర్థం.

ఇక, రెండవ పదం " పిరాన్ "అనేది. ఈ ద్రావిడ పదానికి ఉపకారకుడు అని అర్థం. పెరియాళ్వార్లు పాండ్యరాజసభలో తత్వనిర్ణయాన్ని చేసి, అందరికీ మహోపకారం చేశారు కదా. అందువల్ల ఈ పదం వారి విషయంలో సార్థకం.

ఇది "పట్టర్ పిరాన్ అనే పదానికి ఒక విధమైన వివరణం.

భట్టశబ్దాన్ని వేదాన్ని అధ్యయనం చేసిన బ్రాహ్మణులను తెలుపుతున్నట్లుగా గ్రహించి, వారికి వేదాంతతత్వాన్ని తెలియజేసిన ఉపకారకులు కనుక, "పట్టర్ పిరాన్" అయ్యారు అని ఇంకొక అర్థాన్ని చెప్పవచ్చు.

ఈ విధంగా ఉండే రెండు అర్థాలను నాయనార్ తమ వ్యాఖ్యానంలో " బ్రాహ్మణర్ క్కు ఉపకారకర్. వేదప్పయన్ కొళ్ళవల్లరాకైయాలే తాత్పర్యార్థత్తై సర్వర్ క్కుమ్ ఉపకరిక్కుమవర్. పట్టర్ గళుక్కు విద్యాప్రదానమ్ పణ్ణిన ఉపకారకర్" (బ్రాహ్మణులకు ఉపకారకులు. వేద ప్రయోజనాన్ని గ్రహించినవారు కనుక, వేదతాత్పర్యార్థాన్ని అందరికీ తెలియజేసి, ఉపకారం చేసినవారు. వేదాలను అధ్యయనం చేసిన వారికి తత్వవిద్యాప్రదానాన్ని చేసిన ఉపకారకులు) అనే వ్యాఖ్యాన సూక్తులు ఈ వివరణలను తెలుపుతున్నాయి.

ఈ వివరణలు ఈ విధంగా ఉండగా, ఇంకొక అద్భుతమైన వివరణను నాయనార్ " మఱై నాన్గు మున్నోదియ పట్టనుక్కు కన్యకాప్రదానమ్ పణ్ణిన ఉపకారకర్" ("మఱై నాన్గు మున్నోదియ పట్టన్ " – సాందీపముని దగ్గర 64

విద్యలను నేర్చినవాడు కనుక, శ్రీకృష్ణుడు అని "భట్టః" అని చెప్పదగినవాడు. అటువంటి శ్రీకృష్ణ భగవానునకు గోదాదేవిని కన్యాదానం చేసి ఉపకారం చేసినవారు కనుక "పిరాన్") అని అనుగ్రహించారు. ఈ వివరణలో "పట్టర్" అనే పదం భగవంతుని, "పిరాన్" అనే పదం పెరియాళ్వారులను సూచిస్తున్నదని తెలుస్తున్నది. శ్రీరంగంలో ఉండే శ్రీరంగనాథునకు పెరియ పెరుమాళ్ అని పేరు. పెరుమాళ్ అని సంప్రదాయంలో వ్యవహరింపబడే శ్రీరాముని చేత ఆరాధింపబడినవాడు కనుక, శ్రీరంగనాథునకు ఆ నామం ఏర్పడింది. పెరియ పెరుమాళ్ అంటే, గొప్పవారికి కూడా గొప్పవాడు అని అర్థం. అటువంటి శ్రీరంగనాథునకు గోదాదేవిని కన్యాదానం చేసి, ఆ స్వామి మామగారు అయినందువల్ల గౌరవనీయులై, ఉపకారకులు అయ్యారు కదా, పెరియాళ్వార్లు.

ఈ విధంగా కూడా వారికి " పట్టర్ పిరాన్ " అనే పేరు సార్థకం అయినది – అని నాయనార్ తెలిపిన ఇంకొక అందమైన వివరణం.

★★★★★